MOHAN PUBLICATIONS

SUNDAY MAGAZINE

19 ఫిబ్రవరి 2017

# ఆదివారం ఆంధ్రజ్యోతి

Land route "One Belt"

Silk Road routes

# ఈస్ట్ విండ్

## బీజింగ్ టు లండన్ గూడ్స్ ట్రైన్









# సుందరాంగులు సరికొత్తగా...

ఫిల్మ్‌నగర్

కమర్షియల్ చిత్రాల్లో గ్లామర్‌గా కనిపిస్తూనే వీలుచిక్కితే నటనకు స్కోప్ ఉన్న డిఫరెంట్ రోల్స్ వేయాలనుకుంటారు హీరోయిన్స్ ఎవరైనా. అలాంటి అవకాశాల కోసం ఆశగా ఎదురుచూస్తుంటారు కూడా. ఇటీవల బాలీవుడ్ హీరోయిన్స్ చేస్తున్న కొన్ని సినిమాలు ఆసక్తిని కలిగిస్తున్నాయి. మాఫియా డాన్ దావూద్ ఇబ్రహీం సోదరి హసీనా పార్కర్ జీవితకథ ఆధారంగా తెరకెక్కుతున్న 'హసీనా... ది క్వీన్ ఆఫ్ ముంబాయి'లో టైటిల్‌రోల్ చేస్తోంది శ్రద్ధాకపూర్. ఇప్పటిదాకా బబ్లీగా కనిపించిన శ్రద్ధాకు ఈ సినిమా సవాలువంటిదే. వేశ్యావాటికను నిర్వహించే 'బేగంజాన్'గా విద్యాబాలన్ ఫస్ట్‌లుక్ పోస్టర్ కూడా అందర్నీ ఆకట్టుకుంది. కంగనారనౌత్ (రంగూన్), అనుష్క శర్మ (ఫిల్లౌరీ), సోనాక్షి సిన్హా (నూర్), అలియాభట్ (బద్రీనాథ్ కీ దుల్హనియా)లు కూడా సరికొత్త లుక్స్‌తో ఇప్పటికే అదరగొట్టారు. ఈ సినిమాలన్నీ విడుదలకు ముందే చర్చనీయాంశంగా మారడం విశేషం.

## ఇండెక్స్







# ఆదివారం ఆంధ్రజ్యోతి

19 ఫిబ్రవరి 2017


## ఇన్‌బాక్స్

### ఆర్గానిక్ అద్భుతం!

దేశానికి వెన్నెముక అని చెప్పుకునే రైతు నేడు పెరిగిపోతున్న పెట్టుబడి భారాన్ని మోయలేక.. పండించిన ఉత్పత్తులకు సరైన గిట్టుబాటు ధర దొరకక అప్పుల ఊబిలో ఇరుక్కుని కుదేలవుతున్నాడు. ఖరీదైన రసాయనిక ఎరువులు కూడా సరిగ్గా పనిచేయక, కల్తీ ఎరువుల వల్ల.. నకిలీ విత్తనాల వల్ల నష్టపోయి ఆత్మహత్యలు చేసుకున్న రైతులు ఎందరో ఉన్నారు. ఇలాంటి సమయంలో సేంద్రీయ విధానం ద్వారా లాభసాటి వ్యవసాయం చేస్తోన్న రైతుల కథనాలు మిగిలిన రైతులలో నూతన ఉత్సాహాన్ని కలిగిస్తాయనడంలో సందేహం లేదు. పర్యావరణ హితమైన ఆర్గానిక్ వ్యవసాయం గురించి ప్రభుత్వం కూడా రైతులకు క్షేత్రస్థాయిలో అవగాహన, ప్రోత్సాహం కల్పించాలి.

**- జగన్‌మోహన్,** సోమల

### ఎత్తైన 'పిరమిడ్' ఇది!

'పిరమిడ్' కథ తెలుగుకథను కొత్త ఎత్తులకి ఎక్కించింది. ఊపిరి తిరగని పనులు, ఉద్వేగం, తెరిపిలేని ఆలోచనలు తేనెటీగల్లా ముసిరి విసిగిస్తున్నా ముసిముసి నవ్వుల గాంభీర్యం ఈనాటి ధనిక ప్రపంచపు అధినేతల 'ది మోస్ట్ గ్లామరైజ్డ్ గెశ్చరు'గా ఉంటోంది. ఆ గ్లిట్టరింగ్ భంగిమల చాటున నీలివలయాల ఊబి ఎంత దట్టంగా అల్లుకుని ఉంటుందో వివరించేందుకు పాపినేని శివశంకర్ ఎంచుకున్న సర్రియలిస్టిక్ రచనాశైలి ప్రశంసనీయం. అవకాశం దొరకని అదృష్టమేదో మనలోని చాలామందిని ఇంకా బుద్ధిమంతుల పద్దుకిందే మిగిల్చి ఉందన్నది నిజం. కథ కట్టడంలో రచయిత కనబరిచిన మేస్త్రీ పనితనం ఈ కథకు శాశ్వతమైన అందాలు చేకూర్చిపెట్టింది.

**- కర్లపాలెం హనుమంతరావు,** హైదరాబాద్



జీవితమంటే ఎత్తైన పిరమిడ్ కాదు. మనిషిగా ఎంత ఎత్తులో ఉన్నామనేదే అసలైన పిరమిడ్. ప్రధాన పాత్రను మాటిమాటికీ 'ఐదున్నర అడుగుల మిత్రుడు' అని చెబుతూ రావడం వల్ల మనిషికి చివరికి ఎంత భూమి కావాలో గుర్తు చేస్తూ వచ్చారు. బడాబాబులు బ్లాక్‌మనీ కేసులు ఎప్పుడు తమను కబళిస్తాయో తెలియక భయంతో లోలోపల నలిగిపోతూ పైకి మాత్రం మేకప్ నవ్వులతో తిరుగుతున్న వేళ ఈ కథ రావడం సందర్భోచితంగా అనిపించింది.

**- పి. సీతారామరాజు,** కాకినాడ

### సూర్యుడి ముందు దివిటీ

ఎంత అందమైన టెక్నీ కలర్ జుబ్బా తొడిగినా శివశంకర్‌గారి పిరమిడ్ కథ టాల్‌స్టాయ్ ఏనాడో రాసిన "How Much Land Does A Man Need?' అన్న పారబుల్ ముందు... సూర్యుడి ముందు... వెలవెల పోతూ నిలబడ్డ దివిటీ మాదిరిగా అనిపించింది. శిల్పం వస్తువుని మింగేసింది.

**- రెడ్డి శాస్త్రి,** శ్రీకాకుళం



ఒక భావబంధం నిజాయితీగా ఏర్పడినదైతే, ఇక దాని గురించి పదేపదే నొక్కి చెప్పడం అనవసరం. మిత్రుని భార్య ప్రసక్తి వచ్చినప్పుడల్లా విధిగా 'చెల్లి' పదం వాడడం, ఆ కథకునిలో తనకు తానై ఏర్పరచుకున్న ఒక అకారణపు గిల్టీ ఫీలింగ్‌ను పాఠకులపై రుద్దడంగా పర్యవసించింది. అసలు వస్తువు, అందుకు ప్రబలమైన విషయచర్చ రెండూ ఒకపాటి అయోమయానికి గురి చేయడంతో 'పిరమిడ్' కథలో ఏ పాత్రా పాఠకునిపై నిర్దిష్ట ముద్రను వేయలేకపోయాయి.

**- పి.వి. రామశర్మ,** విజయవాడ

### ఉప్పెనంత ప్రేమ

'ఉప్పెనంత ఈ ప్రేమకి..' అనే ఒక్క పాటతో ఎందరో అభిమానుల గుండెల్లో సుస్థిరమైన స్థానం సంపాదించుకున్నారు రచయిత బాలాజీ. ఆయన పాటలు వింటుంటే ప్రేమను అందంగా వ్యక్తం చేసేందుకే పదాలు పుట్టాయా అనిపిస్తుంది. తక్కువ పాటలే రాసినప్పటికీ తనకంటూ ప్రత్యేక గుర్తింపు తెచ్చుకున్న ఆయన ముందుముందు ఇలాంటి పాటలు మరెన్నో రాయాలని ఆశిస్తున్నాం. ప్రపంచవ్యాప్తంగా విస్తరించి ఉన్న తెలుగుదనపు మూలాలను వివరిస్తున్న 'తెలుగు జాడలు' వ్యాసాలు చాలా బాగున్నాయి.

**- కిశోర్ గ్రంథి,** ఈమెయిల్, **సిల్వాన్ గద్దె,** ఈమెయిల్

'ఆదివారం అనుబంధం'పై మీ అభిప్రాయాలను శుక్రవారంలోగా అందేలా పంపగలరు. ఆలస్యంగా అందిన ఉత్తరాలు ప్రచురించడం సాధ్యపడదని మనవి. sunday.aj@gmail.com కి మీ ఉత్తరాల్ని మెయిల్ చేయవచ్చు.

# నోరూరించే ఫ్యాషన్ షో!







'చెత్త' ఫ్యాషన్, 'రీ సైక్లింగ్' ఫ్యాషన్, 'గ్రీన్' ఫ్యాషన్... ఇలా ఫ్యాషన్ ప్రపంచంలో వింత వింత దుస్తులు ధరించి క్యాట్‌వాక్ చేసే ఎంతోమంది మోడళ్లను చూశాం. వాడిపారేసిన కోక్ డబ్బాలు, న్యూస్‌పేపర్లు, కూరగాయలు, పళ్లు... 'కావేవీ మోడలింగ్‌కు అనర్హం' అన్న చందంగా 'వేలం' వెర్రిగా తాము రూపొందించిన దుస్తులను అందమైన మోడళ్ల చేత ప్రదర్శిస్తుంటారు ఫ్యాషన్ డిజైనర్లు. వాటికి భిన్నంగా బెల్జియంలోని బ్రస్సెల్స్‌లో ఇటీవల జరిగిన ఫ్యాషన్ షో తీపి వాసనలతో గుబాళించింది. 'లీ సలోన్ డె చాకొలెట్' పేరిట నిర్వహించిన ఈ ఫ్యాషన్ షోలో పాల్గొన్న మోడళ్లంతా చాక్లెట్ దుస్తులనే ధరించారు. చాక్లెట్‌తో చేసిన టోపీ, చాక్లెట్‌తో చేసిన పువ్వులు, గౌనులు, బెల్టులు, వాచీలు ధరించి వీక్షకులకు కనువిందే గాక నోరూరేలా చేశారు. ఈ చాక్లెట్ షోకు పిల్లల్ని అనుమతించారో లేదో...!





అవీ ఇవీ

# సైకిళ్ల కోసం ఫ్లైఓవర్



వాహనాలు రోడ్డుపైన, పాదచారులు ఫుట్‌పాత్‌పైన వెళ్లాలనేది రూలు. అయితే ఈ మధ్య చాలామంది ఫుట్‌పాత్‌లను కూడా ఆక్రమించుకుని పాదచారులకు వేరే దారి లేకుండా చేస్తున్నారనుకోండి. అలాంటప్పుడు సైకిళ్లకు ప్రత్యేకంగా ఫ్లైఓవర్ కట్టడమంటే విశేషమే. చైనాలోని ఫ్యూజియాన్ ప్రాంతంలో కార్లు, బస్సులు దూసుకుపోయే ప్రధాన మార్గానికి ఆటంకం కలుగకుండా 7.6 కిలోమీటర్ల పొడవున్న సైకిల్ బ్రిడ్జిని ఇటీవల నిర్మించారు. ప్రస్తుతం ట్రయల్‌రన్ సాగుతోన్న ఈ మార్గం 'గ్రీన్ ట్రాన్స్‌పోర్టు'కు అనుకూలంగా ఉందని స్థానికులు సంతోషం వ్యక్తం చేస్తున్నారు.



నవ్వేజనా






సరదా

**('రోజా' చిత్రంలోని "చిన్ని చిన్ని ఆశ..." పాటకు)**

**చి**న్ని చిన్ని దోశ .. ఉల్లిపాయ దోశ
రోస్టుగా వేశా .. వేడి రవ్వ దోశ
కారమే పూసీ .. పెద్దదిగా పోశా ..
నూనె చిలకరించి నెమ్మదిగా తీశా ..



సాంబారులోన ముంచుకోవాలి
చట్నీతో కొంచెం నంచుకోవాలి
మంటగా ఉంటే చిందులేయాలి
గొంతు దిగకుంటే నీళ్లు తాగాలి /చిన్ని/

చేతులే కడిగి పైకి లేవాలి
లేవలేకుంటే సాయమడగాలి
గ్యాసు ఫామైతే సోడా తాగాలి
మత్తుగా ఉంటే నిదురపోవాలి /చిన్ని/

**- కె. ఆనంద్, 73307 37033**

---

## అదే తేడా!

**"**క్లాసికల్‌కీ, డిస్కోకీ తేడా ఏంటి?"
"మొదటిదానికి తలాడిస్తారు. రెండో దానికి కాళ్లాడిస్తారు."

## చేతులు కాలాక...



**'నీ**వంటే ఇష్టం' అంది.
నిజమనుకున్నాడు!
పెళ్లయ్యాకే తెలిసింది.
నీ'వంటే' ఇష్టం అందని!!

---

## ఔరా!

● నిద్రపోతున్న ఒక బిచ్చగాడి ముందున్న బోర్డు మీద ఇలా రాసి ఉంది.

"దాతలారా ... దయచేసి చిల్లర డబ్బులు డబ్బాలో వేసి నా నిద్ర చెడగొట్టొద్దు. నోట్లు మాత్రమే వేయమని మనవి"

---

## తరాల అంతరం



**న**డిచి వెళ్లి 20 రూపాయలు పొదుపు చేశాడు తండ్రి.

బస్సులో వెళ్లి 20 నిమిషాలు పొదుపు చేశాడు కొడుకు.

ఆశ్చర్యం - ఇద్దరూ చేసింది పొదుపే!

---

## క్యా డైలాగ్ హై



● "నేను నీ పెళ్లి చేసిన తర్వాత నిన్ను సాగనంపేటప్పుడు నేను కన్నీళ్లు పెట్టుకోవాలే కాని ... పెళ్లి చేయడానికి కన్నీళ్లు పెట్టుకోకూడదు."

- చిత్రం: **నేను లోకల్**



'నమఃశివాయ' అనే పంచాక్షరి జపించినంతనే మహాశివుడు పరవశుడై అన్ని కష్టాలను తొలగించి వేస్తాడని శివపురాణం చెబుతోంది. 'శివయ్యా..' అని ఆర్తితో పిలిస్తే చాలు బోళా శంకరుడు కరిగిపోయి కరుణించి, కోరిన వరాలు ప్రసాదిస్తాడని అనేక పురాణ కథలు చెబుతున్నాయి. ఆ మహాశివుడి కోసం మనం రాత్రంతా మేలుకునే రోజు మహాశివరాత్రి.

# శంభో శంకర

చర్మాంబరాయ శివభస్మ విలేపనాయ
ఫాలేక్షణాయ మణికుండల మండితాయ
మంజీరపాదయుగళాయ జటాధరాయ
దారిద్ర్య దుఃఖ దహనాయ నమశ్శివాయ

శుభములను ఇచ్చువాడు కాబట్టి ఆయన శివుడు. దేవతలకు దేవుడు కాబట్టి ఆయన మహాదేవుడు. గంగను తలపై మోసేవాడు కాబట్టి గంగా ధరుడు. పార్వతికి సగభాగం ఇచ్చినవాడు కాబట్టి అర్ధనారీశ్వరుడు... మూడు కన్నులవాడు కాబట్టి ముక్కంటి, విషాన్ని గొంతులో దాచుకున్నవాడు కాబట్టి గరళకంఠుడు... ఇలా మహేశ్వరుడికి నామాలు ఎన్నెన్నో!

### శివరాత్రి కథ

దేవతలు, అసురులు కలిసి అమృతం కోసం క్షీరసాగర మథనం జరపడం, ముందొచ్చిన గరళాన్ని శివుడు మింగడం తెలిసిన విషయాలే.. దాన్ని కంఠంలో నిలిపి ఉంచుకోవడం వల్లనే శివుడు 'నీలకంఠుడు' అయ్యాడనేది తెలిసిందే. ఆ రాత్రి శివుడు పడుకుంటే విషం శరీరమంతా వ్యాపించే ప్రమాదం ఉన్నందున ఆయనకు నిద్రరాకుండా దేవతలు, అసురులందరూ కలిసి ఐదు జాముల కాలం ఏకధాటిగా ఆడిపాడారట. ఆ రోజు మాఘ బహుళ చతుర్దశి. వారు ఆడిపాడిన ఐదు జాముల కాలాన్నే 'మహాశివరాత్రి' అని పిలుస్తారు. అప్పటినుంచి ఏటా మాఘ మాసంలో వచ్చే బహుళ చతుర్దశి రోజున మహాశివరాత్రి పర్వదినాన్ని జరుపుకుంటున్నాం. ఆ రోజు భక్తులు చేసే ఉపవాసం, జాగారణతో శివారాధన చేస్తారు. అలాగే శివపార్వతుల కళ్యాణం, శివలింగోద్భవం కూడా ఈ రోజే జరిగాయని అంటారు.

శివరాత్రి రోజున శైవాలయాలన్నీ దీపకాంతులతో దేదీప్యమానంగా కాంతులీనుతాయి. తెలుగురాష్ట్రాల్లోని అన్ని శివాలయాల్లో ప్రత్యేక పూజలు, అభిషేకాలు, శివపార్వతుల కల్యాణం నిర్వహిస్తారు. కర్నూలు జిల్లా శ్రీశైలంలో జరిగే శివరాత్రి ఉత్సవాలకు ప్రతీ ఏడాది దాదాపు 8 లక్షల మంది భక్తులు వస్తుంటారు. ఉదయం 10 గంటల సమయంలో 11 మంది పూజారులు కలిసి వేద మంత్రోచ్చారణలతో 'లింగోద్భవ మహారుద్రాభిషేకం' దాదాపు 3 గంటలపాటు నిర్వహిస్తారు. ఈ అభిషేకం తర్వాత గుడికి నాలుగు వైపులా ఉన్న గోపురాలకు తెల్లని వస్త్రాన్ని చుడతారు. దీన్ని పాగాలంకరణ అంటారు. ఏటా ఈ పాగాలంకరణకు ఉపయోగించే వస్త్రాన్ని ప్రకాశం జిల్లాకు చెందిన పృథ్వీ వెంకటేశ్వర్లు అనే వ్యక్తి కుటుంబ సభ్యులు స్వయంగా తయారుచేసి తీసుకువస్తారు. ఆరోజు రాత్రివేళ భ్రమరాంబ మల్లికార్జునుల కల్యాణం జరుగుతుంది.

చిత్తూరు జిల్లా శ్రీకాళహస్తిలో 14 రోజుల పాటు బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. ఈ ఆలయంలోనే 'తిన్నడు' శివుడికి తన కళ్లు అర్పించి 'భక్త కన్నప్ప'గా పేరుగాంచాడు. దానికి గుర్తుగా 'కన్నప్ప ధ్వజారోహణ'తో శివరాత్రి ఉత్సవాలకు అంకురార్పణ జరుగుతుంది. ఉత్సవాల్లో భాగంగా 14 రోజుల పాటు జ్ఞానప్రసూనాంబికా సమేత శ్రీకాళహస్తీశ్వరుడిని వివిధ వాహనాల్లో ఊరేగిస్తారు. రాహు, కేతు దోషం ఉన్నవాళ్లు, నాగదోషం ఉన్నవారు ఈ ఆలయానికి వచ్చి దోష నివారణ పూజలు చేస్తుంటారు.

వరంగల్ వెయ్యిస్తంభాల గుడిలో 'రుద్రాభిషేకం'తో శివరాత్రి ఉత్సవాలు ప్రారంభమవుతాయి. వారం రోజుల పాటు సాగే ఈ ఉత్సవాలు శివరాత్రి రోజున జరిగే 'రుద్రేశ్వరస్వామి కల్యాణం'తో ముగుస్తాయి. ఇక్కడ ఉత్సవాల్లో ప్రదర్శించే 'పేరిణి శివతాండవం' నృత్యం ప్రత్యేకాకర్షణగా నిలుస్తుంది.

దేశవ్యాప్తంగా శివరాత్రి ఉత్సవాలు ఘనంగా జరుగుతాయి. హిమాచల్‌ప్రదేశ్ 'మండి'లోని భూతనాథ దేవాలయంలో కన్నుల పండుగగా జరిగే 'మండి శివరాత్రి ఫెయిర్'ను ఒక్కసారైనా చూసి తీరాల్సిందే. వారం రోజుల పాటు సాగే ఈ ఉత్సవాలకు దేశ, విదేశాల నుంచి కూడా అధిక సంఖ్యలో జనం తరలివస్తుంటారు. అక్కడి రాజవంశీయులు 500 ఏళ్ల కిందటే శివరాత్రి ఉత్సవాలను ప్రారంభించినట్లు చెబుతారు.

వారణాసిలోని త్రయంబకేశ్వర ఆలయంలో శివరాత్రి రోజున శివపార్వతుల కల్యాణం జరుగుతుంది. ఈ కల్యాణాన్ని వీక్షించడానికి లక్షలాదిగా భక్తులు తరలివస్తారు. శివకల్యాణం తర్వాత భక్తులంతా ఆనందంతో నృత్యాలు చేయడం ఇక్కడి ప్రత్యేకత. మధ్యప్రదేశ్ ఖజురహోలోని మాతంగేశ్వర ఆలయంలో 10 రోజుల పాటు శివరాత్రి ఉత్సవాలు జరుగుతాయి. ఒరిస్సాలోని 'పూరీ' లోకనాథ ఆలయంలో శ్రీరాముడే స్వయంగా శివలింగాన్ని ప్రతిష్ఠించాడని నమ్ముతారు. ఏడాదంతా నీటిలో ఉండే ఈ శివలింగాన్ని మహాశివరాత్రికి మూడు రోజుల ముందు భక్తుల దర్శనార్థం బయటికి తీస్తారు. ఆ సమయంలో ఆలయ ప్రాంగణం 'హర హర మహాదేవ శంభో శంకర' అంటూ శివనామస్మరణతో మార్మోగిపోతుంది.

అస్సాం సిబ్‌సాగర్ 'శివడోల్' దేవాలయం, గౌహతి ఉమానంద ఆలయం, ఉత్తరాఖండ్ హరిద్వార్, రిషికేశ్, మహారాష్ట్ర నాసిక్, కశ్మీర్ వ్యాలీ, మధ్యప్రదేశ్ ఉజ్జయిని శివాలయాలలో కూడా మహాశివరాత్రి వేడుకలు ఘనంగా జరుగుతాయి.

ఫిబ్రవరి 24: మహాశివరాత్రి



# సముద్రం దాచిన శివాలయం



గుజరాత్ రాష్ట్రం భావనగర్ జిల్లాలో అరేబియా సముద్ర తీరంలో ఉంది కొలియాక్ గ్రామం. తీరానికి ఒకటిన్నర కిలోమీటర్ల దూరంలో ఒక విశాలమైన రాతి చప్టా కనిపిస్తుంది. ఓ పక్క త్రిశూలం, మరోపక్క శివలింగాలు కనిపిస్తాయి. పైన సిందూర వర్ణ పతాకం రెపరెపలాడుతూ కనిపిస్తుంది. ఇక్కడ శివలింగాలతో పాటు ఒక నీటి గుంట ఉంది. దీనిని 'పాండవ కొలను' అని పిలుస్తారు. భక్తులు ఈ కొలనులో కాళ్లు కడుక్కొని శివుణ్ణి దర్శించుకుంటారు. సముద్రంలో ఆలయమేంటి? దాన్నెవరు నిర్మించారు? ఎలా వెళ్లడం?... అని ఎవరికైనా ఉత్సుకత కలుగుతుంది. మన ఉత్సాహానికి సమాధానాలు దొరికేలోపే ఆ గుడి మాయమైపోతుంది. ఇరవై అడుగుల పొడవున్న ఆలయ ధ్వజస్తంభం పూర్తిగా నీట మునిగి దానిపైనున్న జండా ఒక్కటే రెపరెపలాడుతూ కనిపిస్తుంది. ఏమిటీ వింత? అనే మరో కొత్త ప్రశ్న ఎదురవుతుంది.

కురుక్షేత్ర మహా సంగ్రామం ముగిసిన తర్వాత ఐదుగురు పాండవులూ భాతృ, బంధువర్గ హత్యాపాతకాల నుంచి విముక్తి కోసం ఇక్కడ అయిదు శివలింగాలను ప్రతిష్టించి కొలిచారట. వారి ప్రార్థనను మన్నించడంతో ఆనాటి నుంచి సర్వేశ్వరుడు ఇక్కడ 'నిష్కలంక మహదేవ్'గా పూజలు అందుకుంటున్నాడు. కాలక్రమంలో ముందుకు రావడమో, వెనక్కిపోవడమో సముద్రం లక్షణం. కొన్నిచోట్ల వెనక్కి తగ్గి కొత్త భూభాగాన్ని సృష్టిస్తే... మరికొన్ని చోట్ల ముందుకు వచ్చి ఉన్న భూభాగాన్ని తనలో కలిపేసుకుంటుంది సముద్రం. అలా ఈ శివాలయం సముద్రంలో మునిగిపోయింది.

అయితే రోజులో కొన్నిగంటల పాటు ఆటు సమయంలో సముద్రమట్టం తగ్గి ఆలయం బయటపడుతుంది. పౌర్ణమి, అమావాస్య రోజులలో సముద్ర పోటు ఎక్కువగా ఉన్నప్పటికీ, ఆటు సమయం కూడా ఎక్కువే కనుక ఆ రెండు రోజులలో భక్తులు అధిక సంఖ్యలో వస్తారు. ఏటా శ్రావణ మాసంలో ఇక్కడ భాదర్వి అనే వేడుక జరుగుతుంది. భావనగర్ రాజవంశీయులు ఆ వేడుకలో పాల్గొని ధ్వజ స్తంభంపై కొత్త జెండాలను ఆవిష్కరిస్తారు. రోజూ ఉదయం ఏడు గంటలకు, సాయంత్రం ఆరున్నర గంటలకు హారతి ఇస్తారు. మహాదేవుణ్ణి అర్చించాలనుకునేవారు ఆ సమయం కోసం నిరీక్షించాల్సిందే! ఆ సమయంలోనే నడుములోతు నీళ్లల్లో తాళ్ల సహాయంతో నడుస్తూ ఆలయాన్ని చేరుకోవచ్చు. ఇలా సముద్రం ఆలయాన్ని ముంచి, మళ్లీ వెనక్కి వెళ్లినట్టే... తమను నిండా ముంచిన పాపాలు... ఆ మహేశ్వరుడి అనుగ్రహంతో వెనక్కి మళ్లిపోతాయని భక్తుల విశ్వాసం.



కవర్ స్టోరీ




# ఈస్ట్‌విండ్ ఎక్స్‌ప్రెస్

## బీజింగ్ టు లండన్ గూడ్స్ ట్రైన్

**'వన్ బెల్ట్ వన్ రోడ్ (ఒబిఒఆర్)... ప్రస్తుతం ప్రపంచదృష్టిని ఆకర్షిస్తున్న ఒక మహారహదారి. వ్యాపార విస్తరణతో పాటు, ప్రపంచశక్తిగా తనను తాను స్థిరపరుచుకునే ద్విముఖవ్యూహంతో చైనా గత కొన్నేళ్లుగా పాత 'సిల్క్‌రూట్'ను సరికొత్తగా అభివృద్ధి చేస్తోంది. కొన్ని వేల కోట్ల డాలర్ల పెట్టుబడితో ఆసియా, ఐరోపా, ఆఫ్రికాలోని దాదాపు 60కి పైగా దేశాలను భాగస్వాములుగా చేసుకుని 'డ్రాగన్' దేశం (చైనా) నిర్మిస్తున్న బృహత్ ప్రాజెక్టు ఇది. ఇటీవలే ఈ రూటులో 'ఈస్ట్‌విండ్' ఎక్స్‌ప్రెస్ విజయవంతంగా ప్రయాణించి ప్రపంచ వాణిజ్యాన్ని కీలక మలుపు తిప్పింది. ప్రపంచాధిపత్యం నుంచి ట్రంప్ సారథ్యంలోని అమెరికా తిరోగమిస్తున్న వేళ... ఆ స్థానాన్ని చేజిక్కించుకునేందుకు 'ఒబిఒఆర్'ను ఒక అస్త్రంగా చైనా మల్చుకుంటోంది. అంతర్జాతీయ వాణిజ్య సంబంధాలనూ ప్రపంచీకరణను పునర్నిర్వచిస్తోంది. ప్రస్తుతం ప్రపంచవ్యాప్తంగా చర్చనీయాంశంగా మారిన ఈ 'రూటు' గురించిన విశేషాలే ఈ వారం కవర్‌స్టోరీ.**

● వి. శ్రీనివాస్

**తూ**ర్పు చైనా రాష్ట్రం జెజియాంగ్‌లోని ఇవూ నగరం నుంచి 2017 జనవరి 1న 44 కంటైనర్లతో కార్గో ఎక్స్‌ప్రెస్ రైలు 'ఈస్ట్‌విండ్' బయలుదేరింది. 18 రోజులు ప్రయాణించి జనవరి 18న లండన్ శివార్లలోని బార్కింగ్‌లో ఉన్న యూరోహబ్ సరుకుల టెర్మినల్‌ను చేరింది. మధ్యలో రైల్వే లైన్ గేజ్‌ల్లో తేడాల కారణంగా మూడుచోట్ల సరుకు వేరే రైళ్లలోకి మారింది. గత కొన్నేళ్లుగా కొత్త పుంతలు తొక్కుతున్న చైనా-యూరప్ వాణిజ్యంలో ఇదొక కీలకమైన ఘట్టం. ఇవూలో బయల్దేరిన రైలు కజకిస్తాన్, రష్యా, బెలారస్, పోలాండ్, జర్మనీ, బెల్జియం, ఫ్రాన్స్... మొత్తం తొమ్మిది దేశాల మీదుగా 12 వేల కిలోమీటర్ల దూరం ప్రయాణించి బ్రిటన్ చేరింది. దారిలో ఎన్నో పర్వతాలు, అరణ్యాలు, నదులు, ఎడారులు, మైదానాలను దాటిందా రైలు. సాధారణంగా దేశాల మధ్య జరిగే సరుకుల ఎగుమతీ దిగుమతులు సముద్రమార్గంలో లేదా విమానాల ద్వారా జరుగుతాయి. 'ఈస్ట్‌విండ్' మోసుకువచ్చిన సరుకులనే ఒకవేళ నౌకలలో లండన్‌కు చేరవేయాలంటే కనీసం 45 రోజులు పడుతుంది. విమానాల్లో అయితే సమయం తక్కువే అవుతుంది. కాని రైలు కంటే కనీసం ఐదు రెట్లు ఎక్కువ ఖర్చవుతుంది. గగనమార్గం కంటే చౌకగా, సముద్రమార్గం కంటే మూడురెట్లు వేగంగా విదేశీ మార్కెట్లకు సరుకులను తరలించేందుకు చైనా తన పాత సిల్క్‌రూట్‌నే సరికొత్తగా రూపొందించుకుంది.

చైనా నగరాలనుంచి ప్రతివారం కార్గో కంటైనర్లతో డజనుకు పైగా రైళ్లు యూరప్‌లోని 15 ముఖ్య నగరాలకు వెళ్లడం మొదలై నాలుగేళ్లయింది. ముున్ముందు ఈ సర్వీసులను రోజువారీగా నిర్వహించే ఆలోచనలో కూడా ఉంది చైనా. తమ దేశంలోని మొత్తం 31 రాష్ట్రాల నుంచి యూరప్‌కు రైల్వే నెట్‌వర్క్ ఏర్పాటు చేసే సన్నాహాల్లో ఉంది చైనా ప్రభుత్వం. ప్రస్తుతం చైనా రైళ్లు యూరోపియన్ నగరాలకు చేరడానికి పడుతున్న సమయం 10-15 రోజుల వరకు ఉంది. దీనిని 3-4 రోజులకు తగ్గించే విధంగా హైస్పీడ్ కార్గో రైళ్లను రంగంలోకి దింపడం చైనా తదుపరి వ్యూహం. ఐరోపా దేశాలతో చైనా ప్రస్తుత వాణిజ్య విలువ 60 వేల కోట్ల డాలర్లు. 2020 నాటికి ఇది లక్ష కోట్ల డాలర్లకు చేరుతుందని అంచనా. చైనా మొత్తం ఉత్పత్తుల్లో మూడో వంతు యూరప్‌కు ఎగుమతి అవుతున్నాయి. యూరప్ దిగుమతుల్లో చూస్తే 50 శాతం వాటా చైనాదే. ఇయు (యూరోపియన్ యూనియన్) ఎగుమతులకు కూడా చైనానే అతిపెద్ద మార్కెట్. అందువల్ల ఇది వారికిది ఉభయతారకం. బ్రెగ్జిట్ తర్వాత యూరప్ దేశాల నుంచి సహకారం తగ్గే అవకాశం ఉన్నందున బిజినెస్ కోసం చైనాకు చేరువగా వెళ్లేందుకు బ్రిటన్ కూడా సిద్ధంగా ఉంది.

## ఈస్ట్ విండ్ విల్ ప్రివేల్ ఓవర్ ది వెస్ట్ విండ్: మావో

ఏదో ఒక రోజు కమ్యూనిజం జయిస్తుందనీ, కాపిటలిజం లయిస్తుందని చైనా విప్లవసారథి మావో అంచనా. అందుకే పశ్చిమగాలులపై తూర్పు పవనాలదే పై చేయి అవుతుందని చెప్పారు. చైనా నుంచి 40 పైగా కంటైనర్లతో జనవరిలో లండన్‌కు చేరిన చైనా కార్గో రైలు పేరు 'ఈస్ట్‌విండ్'. మావో జోస్యం ఒకరకంగా నిజమైంది. ఆయితే ఆయన అనుకున్న అర్థంలో కాదు. ఇప్పుడూ తూర్పు పవనాల్లోనూ పశ్చిమ గంధమే గుబాళిస్తోంది.



### పశ్చిమాసియా దేశాలతో అనుబంధం ...

జర్మనీ, ఫ్రాన్స్, బ్రిటన్, పోలాండ్, ఇటలీ, నెదర్లాండ్స్, హంగేరి వంటి ఐరోపా దేశాలను రైల్వే నెట్‌వర్క్‌తో అనుసంధానం చేసిన చైనా ఇరాన్‌తోనూ పాకిస్తాన్‌తోనూ రైల్వే నెట్‌వర్క్‌లను అభివృద్ధి చేస్తోంది. రష్యా, మంగోలియా, కజకిస్తాన్, తుర్కెమినిస్తాన్ వంటి దేశాలతో ఇప్పటికే సన్నిహితంగా ఉంటోంది. అత్యంతకీలకమైన చైనా-ఇరాన్ రైల్వే నెట్‌వర్క్ ఇప్పటికే ప్రారంభమైంది. గతేడాది జనవరిలో చైనా నుంచి టెహరాన్‌కు కార్గో రైల్వే సర్వీసును ప్రారంభించారు. దాదాపు పశ్చిమాసియా దేశాలన్నింటితోనూ సన్నిహిత వ్యాపార సంబంధాలను చైనా ఏర్పాటు చేసుకుంటోంది. ఇంధన నిల్వలు అపారంగా ఉన్న పశ్చిమాసియా దేశాలతో చైనా అనుబంధం బలపడటం అమెరికా సహా పలు పశ్చిమదేశాలకు కంటగింపుగానే ఉంది. 2003లో కేవలం 400 కోట్ల డాలర్లున్న చైనా-ఇరాన్ ద్వైపాక్షిక వాణిజ్యం 2013 నాటికే 5300 కోట్ల డాలర్లకు చేరింది. దీనిని 60 వేల కోట్ల డాలర్లకు తీసుకువెళ్లాలని లక్ష్యంగా పెట్టుకున్నారు. పాకిస్తాన్ పశ్చిమతీరంలో (మన ముంబయికి ఎగువన) ఉన్న గ్వాదర్ రేవును చైనా తన కీలకస్థావరంగా మార్చుకోనుంది. ఇందుకోసం చైనా నుంచి గ్వాదర్ వరకు రైల్వేలైన్లను అభివృద్ధి చేస్తున్నారు. తర్వాత దశలో ఆఫ్రికా వరకు తన రైల్వే నెట్‌వర్క్ విస్తరణకు చైనా బ్లూప్రింట్ సిద్ధం చేస్తోంది. అనేక కారణాల వల్ల అమెరికా దూరం చేసుకున్న అనేక దేశాలకు చైనా చేరువగా వెళుతోంది. ఈ మొత్తం వ్యవహారంలో బిజినెస్ విస్తరణతో పాటు రాజకీయ ఆకాంక్షలు కూడా ఉన్నాయి. వీటిని నెరవేర్చుకునే సాధనంగా 'ఒబిఒఆర్' ముందుకు వచ్చింది.

### ఏమిటీ ఒబిఒఆర్....

'వన్ బెల్ట్, వన్ రోడ్' (ఒబిఒఆర్)... ఇది చైనా అధినేత జీ జిన్‌పింగ్ కొత్త వ్యూహం. దీనినే 'న్యూ సిల్క్ ఎకనామిక్ రోడ్'గా కూడా వ్యవహరిస్తారు. పురాతన సిల్క్‌రోడ్ మార్గాల్లోనే మళ్లీ ఆసియా, ఐరోపా, ఆఫ్రికాలోని కీలక కేంద్రాలను చైనా ఈ ప్రాజెక్టు ద్వారా చేరాలన్నది ఆయన వ్యూహం. దాదాపు 1600 ఏళ్లపాటు ఈ రహదారుల గుండానే అంతర్జాతీయ వర్తకం వెలుగొందింది. 1453లో కాన్‌స్టాంటినోపిల్ పతనం తర్వాత సిల్క్‌రోడ్‌కు దుర్దశ మొదలైంది. పశ్చిమ దేశాలతో స్పర్ధల కారణంగా సిల్క్‌రోడ్‌ను మూసేశారు. ఆ తర్వాత యూరప్‌లో చోటుచేసుకున్న రాజకీయ, ఆర్థిక పరిణామాలతో ఈ రోడ్ పూర్తిగా మరుగున పడింది. 18వ శతాబ్దం నాటికి వాణిజ్యంపై ఐరోపా దేశాల పట్టు పెరిగింది. దాదాపు రెండుమూడు వందల ఏళ్లపాటు ఆసియా దేశాలు ప్రాభవాన్ని పూర్తిగా కోల్పోయాయి. ఇప్పుడిప్పుడే పరిస్థితి మారుతోంది. ఆసియాలోని ప్రధాన ఆర్థిక శక్తులు చైనా, భారత్ జోరుగా దూసుకుపోతున్నాయి. వరుస సంక్షోభాలతో యూరప్ చతికిలబడింది. అమెరికాలో ట్రంప్ పాలనతో ప్రపంచాధిపత్యం నుంచి అమెరికా తిరోగమనాన్ని సూచిస్తోంది. ఈ సందర్భాన్ని తనకు అనుకూలంగా మార్చుకునేందుకు చైనా సిద్ధపడుతోంది.



## సిల్క్ రోడ్ మీదుగా...

**సి**ల్క్ రోడ్ లేదా సిల్క్‌రూట్... ఇది ఒక నిర్దిష్ట రహదారిని సూచించే పదం కాదు. ప్రాచీన చైనానుంచి వ్యాపార అవకాశాలను వెతుక్కొంటూ పలు ఆసియా, పశ్చిమ దేశాల దిశగా బయలుదేరిన వర్తకసమూహాలు నడిచిన వేరువేరు బాటల సముదాయం. క్రీస్తుకు 200 ఏళ్ల ముందు చైనాను ఏలిన హాన్ వంశీయుల కాలంలో ఈ రహదారులు విస్తృతంగా ప్రచారంలోకి వచ్చాయి. జర్మనీకి చెందిన భూగోళ శాస్త్రవేత్త, సంచారి ఫెర్డినాండ్ వాన్ రిచ్‌టోఫెన్ 1877లో 'సిల్క్ రోడ్' అనే పేరును ఖరారు చేశారు. నిజానికి ఈ రహదారులపై కేవలం సిల్క్ (చీనాంబరాలు) మాత్రమే ఐరోపా దేశాలకు తరలిపోలేదు. కాగితం, గన్ పౌడర్, ఆయుధాలు, పోర్సెలైన్, లోహాలతో పాటు బానిసల వ్యాపారానికి కూడా ఈ రహదారులే కీలకమయ్యాయి. ప్రాచీన ఐరోపాలో చీనాంబరాలకు ఉన్న డిమాండ్, వర్తకులు మోసుకెళ్లిన సరుకుల్లో వాటి వాటానే ఎక్కువగా ఉండటం వల్ల 'సిల్క్ రోడ్' పేరు స్థిరపడింది. ఈ పురాతన రహదారులపైనే వ్యాపారంతో పాటు, భిన్న భౌగోళిక ప్రాంతాలకు చెందిన కళలు, సంస్కృతి, మతం, తత్వశాస్త్రం, భాష, శిల్పం, విజ్ఞానశాస్త్రం పరస్పర కరచాలనం చేసుకున్నాయి.

## భూమిని చాపలా చుట్టేస్తున్న 'డ్రాగన్'...

గడచిన మూడు దశాబ్దాల్లో ప్రపంచానికి అవసరమైన అన్నిరకాల వస్తువులను ఉత్పత్తి చేస్తూ తన సత్తా చాటుకుంటోంది చైనా. నిర్మాణ రంగంలోనూ చైనా కంపెనీలు ప్రపంచస్థాయికి ఎదిగాయి. 2015లో చైనా ఎగుమతుల విలువ 2.28 లక్షల కోట్ల డాలర్లు (ఇది భారత్ జీడీపీకి సమానం). ఈ విధంగా ఎగుమతుల ద్వారా పోగేసిన వేల కోట్ల సంపద చైనా చేతుల్లో ఉంది. మరోవైపు అమెరికాలో ఇప్పుడు ట్రంప్ 'మేకిన్ అమెరికా' పల్లవి అందుకున్నారు. అమెరికన్లు వినియోగించే వస్తువులు అమెరికాలోనే తయారు కావాలని అంటున్నారు. అమెరికాలో ఉద్యోగాలు అమెరికన్లకే ఇవ్వాలని చెబుతున్నారు.



మారుతున్న పరిస్థితులను దృష్టిలో ఉంచుకొనే చైనా కొత్త ఎత్తులు వేస్తోంది. ఏళ్లుగా తాము పోగేసిన సంపదను ఆసియాలోని పలు దేశాల్లో పెట్టుబడిగా పెట్టడంతో పాటు సంప్రదాయ యూరప్ మార్కెట్లకు నేరుగా చేరేందుకు సన్నాహాలు ప్రారంభించింది. అందులో భాగమే ఆసియా ఐరోపాలను కలిపే రైల్వే నెట్‌వర్క్ విస్తరణ. దీని వల్ల అనేక లాభాలున్నాయి. చైనాలో కేవలం తీరప్రాంత నగరాల్లోనే కాకుండా తీరానికి దూరంగా ఉన్న నగరాల్లో కూడా భారీ ఎత్తున ఉత్పత్తి కేంద్రాలను ఏర్పాటు చేశారు. ఆయా కేంద్రాల నుంచి సరుకులను రేవులకు చేరవేసి అక్కడి నుంచి నౌకల్లో తరలించడం వ్యయప్రయాసలతో కూడిన వ్యవహారం. ఉత్పత్తి కేంద్రాలున్న నగరాల నుంచే వేలమైళ్ల ఆవల ఉన్న మార్కెట్లకు రైళ్ల ద్వారా సరుకులను చేరవేస్తే అన్ని రకాలుగా కలిసివస్తుంది. వర్ధమాన దేశాల్లో రేవులు, ఎయిర్‌పోర్టులు, రహదారులు, రైల్వేలైన్లు, విద్యుత్ కేంద్రాలపై భారీగా ఇన్వెస్ట్ చేయడం వల్ల ఆ దేశాలు ఆర్థికంగా పుంజుకొని భవిష్యత్తులో చైనా ఉత్పత్తులకు మంచి మార్కెట్లుగా మారుతాయి. పైగా అంతర్జాతీయ వ్యవహారాల్లో విశ్వసనీయంగా కూడా ఉంటాయి.

చైనా తన సైనిక సంపత్తిని కూడా గణనీయంగా పెంచుకుంది. వ్యాపార విస్తరణను వెన్నంటి తన బలాన్ని స్థిరపర్చుకునేందుకు సైనిక వ్యూహాలను కూడా చైనా

అందులో భాగమే 'ఒబిఒఆర్'. పాత సిల్క్ రోడ్‌ను వెన్నంటి రైల్వే నెట్‌వర్క్‌ల అభివృద్ధి ఇందులో కీలకం.

నిజానికి ఇది నాలుగేళ్ల క్రితం వ్యూహం. అంతకంటే ఐదేళ్ల ముందు నుంచే చైనా పశ్చిమదేశాలతో రైలుమార్గాల్లో అనుసంధానానికి సన్నాహాలు ప్రారంభించింది. 'ఒబిఒఆర్' కేవలం రహదారులు, రైల్వేల నెట్‌వర్క్ మాత్రమే కాదు. పురాతన సిల్క్‌రోడ్‌లో ఉన్న సముద్ర జలమార్గాల అనుసంధానం కూడా అందులో భాగం. దీనినే 'మారిటైమ్ సిల్క్‌రోడ్'గా చెబుతున్నారు. వన్ బెల్ట్ అంటే రహదారులు, రైల్వే నెట్‌వర్క్... వన్ రోడ్ అంటే సముద్ర మార్గాలు. 'ఒబిఒఆర్' ప్రాజెక్టులో రహదారుల పొడువున ఉన్న 60 దేశాలను కలుపుకుపోవాలన్నది చైనా వ్యూహం. మూడింట రెండువంతుల ప్రపంచ జనాభా ఈ 60 దేశాల్లోనే ఉంది. ప్రపంచ జీడీపీలో 55 శాతం వాటా, ప్రపంచ ఇంధన నిల్వల్లో 75శాతం వాటా ఈ దేశాలకు ఉంది. ఈ బృహత్ ప్రాజెక్టులో భాగంగా 1.3 లక్షల కోట్ల డాలర్ల వ్యయంతో 900 ఇన్‌ఫ్రా ప్రాజెక్టులు చేపడుతున్నారు. ఈ ప్రాజెక్టుకయ్యే లక్షల కోట్ల డాలర్ల వ్యయాన్ని చైనా బ్యాంకులు, ఆర్థిక సంస్థలు, ప్రత్యేక నిధులు సమకూర్చేందుకు సిద్ధంగా ఉన్నాయి. ఈ ప్రాజెక్టు పూర్తయితే 60 దేశాల ఆర్థిక స్థితిగతులు మారిపోతాయని చైనా చెబుతోంది. అయితే మొత్తం 60 దేశాలు చైనాకు బాసటగా నిలుస్తాయా అన్నది అను మానమే. భారత్ సహ ఆసియా, యూరప్‌లోని పలు దేశాల్లో చైనా అంతర్లీన ఆకాంక్షలపై అనుమానాలూ, భయాలు ఉన్నాయి.



చైనా అధ్యక్షుడు
జీ జిన్‌పింగ్

అమలు చేస్తోంది. అందులో భాగంగా మౌలికవసతులపై తాను భారీగా వెచ్చిస్తున్న దేశాల్లోని రేవులు, ఎయిర్‌పోర్టుల నిర్వహణ తమ కంపెనీల చేతుల్లోనే ఉండేట్టుగా చూస్తోంది. చైనా అధినేత జీజిన్‌పింగ్ సిల్క్‌రోడ్ వ్యూహంలో అత్యంత కీలకమైన పార్శ్వం చైనా- పాకిస్తాన్ ఎకనామిక్ కారిడార్ (సిపిఇసి). ప్రస్తుతం భారత్‌ను తీవ్ర ఆందోళనకు గురిచేస్తున్న ప్రాజెక్టు ఇది.

**పక్కలో బల్లెం... 'సిపిఇసి'**

వన్‌బెల్ట్, వన్ రోడ్ స్కీమ్‌లో అత్యంత కీలకమైనది చైనా-పాకిస్తాన్ ఎకనామిక్ కారిడార్ (సిపిఇసి). చైనాలోని జిన్‌జియాంగ్ రాష్ట్రంలోని కష్గర్‌ను పాకిస్తాన్‌లోని అరేబియా సముద్ర తీర నగరం గ్వాదర్‌ను అనుసంధానం చేయడం ఈ కారిడార్ ముఖ్యోద్దేశం. దీనికి సంబంధించి 2015లో ఉభయదేశాల మధ్య 50కి పైగా ఒప్పందాలు జరిగాయి. పాకిస్తాన్‌లో భారీ ఎత్తున రహదారులు, రైల్వే లైన్ల నిర్మాణం, అభివృద్ధి, కొత్త విద్యుత్ ప్రాజెక్టులు, సెజ్‌ల ఏర్పాటు మొదలైనవి ఈ కారిడార్‌లో భాగంగా ఉన్నాయి. ఈ కారిడార్ పూర్తయితే కొత్తగా 7 లక్షల ఉద్యోగాలు వస్తాయని పాకిస్తాన్ అంచనా. పశ్చిమదేశాల తిరస్కారంతో డీలాపడి ఉన్న పాక్‌కు చైనా ముందుకు తెచ్చిన ప్రాజెక్టు వరంలా కనిపిస్తోంది. దీనివల్ల తమ జిడిపి 3 శాతం పెరుగుతుందని పాక్ అంచనా. ఈ ప్రాజెక్టుపై దాదాపు 5000 కోట్ల డాలర్లను చైనా ఇన్వెస్ట్ చేయనుంది. ఈ ప్రాజెక్టులో భాగంగా కరాచి నుంచి లాహోర్‌కు 1100 కిలోమీటర్ల మేర కొత్త రహదారి నిర్మిస్తున్నారు. రావల్పిండి నుంచి చైనా సరిహద్దుల వరకున్న కారాకోరం హైవేను పునర్ నిర్మిస్తారు. ఈ కారిడార్‌లో భాగంగా చమురు, గ్యాస్ పైప్‌లైన్లు కూడా ఏర్పాటు చేస్తున్నారు. 800 కిలోమీటర్ల ఆప్టిక్ ఫైబర్ లైన్ కూడా ఇందులో భాగంగా ఉంది. గ్వాదర్ పోర్టు వల్ల గల్ఫ్ నుంచి పైప్‌లైన్ ద్వారా చమురు దిగుమతి చేసుకొని తమ దేశానికి తరలించడం చైనాకు సులభం అవుతుంది. భారత్ పశ్చిమ తీరంలో తమ నౌకాదళాన్ని మొహరించే వెసులుబాటు కూడా చైనాకు లభిస్తుంది. సరిగ్గా ఇదే భారత్‌ను కలవరపెడుతున్న అంశం. 'సిపిఇసి' పైకి వాణిజ్యమే ప్రధానమని చెబుతున్నా, ఈ ప్రాజెక్టు భారత్ భద్రతకు సవాల్‌ను విసురుతోందన్న భావన ఉంది. పైగా ఈ కారిడార్ పాక్ ఆక్రమిత కాశ్మీర్ భూభాగం నుంచి వెళ్తోంది. ఈ విషయమై చైనా సంప్రదించకపోవడం కూడా భారత్ ఆగ్రహానికి కారణంగా ఉంది. పాకిస్తాన్‌తో మాత్రమే కాదు. భారత్‌కు చేరువలో ఉన్న అనేక దేశాల్లో చైనా ముమ్మరంగా పెట్టుబడులు పెడుతూ తన స్థానాన్ని బలపర్చుకుంటోంది. పొరుగునే ఉన్న నేపాల్ కూడా చైనా పెట్టుబడులకు కీలకంగా మారింది. మాల్దీవుల్లోనూ చైనా చురుగ్గా ఉంది. వ్యాపారం పేరుతో భారత్ చుట్టూ చైనా తన ప్రాబల్యాన్ని బలపర్చుకుంటోందన్న భయాలూ వ్యక్తమవుతున్నాయి. నిజానికి చైనాకు దీటుగా నిలబడే సత్తా భారత్‌కు అన్ని రకాలుగా ఉంది. ఒబిఒఆర్ ప్రాజెక్టులో భారత్‌కు భాగస్వామ్యాన్ని చైనా ఆఫర్ చేస్తోంది. చైనాతో చేతులు కలిపి ఈ కొత్త అవకాశాలను భారత్ అందుకుంటుందా? లేక స్వతంత్రంగా నిలబడి కొత్త సవాళ్ళకు ఎదురునిలుస్తుందా వేచి చూడాల్సిందే.

రచయిత సెల్ : **70133 26915**

## రష్యన్ రైల్వే నెట్‌వర్కే కీలకం

ఆసియా, ఐరోపాలను అనుసంధానం చేస్తూ చైనా విస్తరిస్తున్న రైల్వే నెట్‌వర్క్‌కు వందేళ్ల క్రితం ఏర్పాటైన 'ది ట్రాన్స్ సైబీరియన్ రైల్వే' జీవనాడి అని చెప్పవచ్చు. జార్ చక్రవర్తుల కాలంలో రష్యా తూర్పు మూలనున్న ప్రాంతాలను కలిపేందుకు ట్రాన్స్ సైబీరియన్ రైల్వే వ్యవస్థను అభివృద్ధి చేశారు. చైనా నుంచి యూరప్ చేరుకునే మార్గంలో ఉన్న ఈ రైల్వే నెట్‌వర్క్ పొడవు 9289 కిలోమీటర్లు. ప్రపంచంలోనే అతి పొడవైన రైలు మార్గం. ప్రధాన రైలు మార్గాన్ని కలుపుతూ చైనా, మంగోలియా, ఉత్తర కొరియాకు రైలుమార్గాలున్నాయి. చైనా నుంచి ఉత్తర దిశగా వెళ్లినా ఈ ట్రాన్స్ సైబీరియన్ రైల్వేలైన్‌తో కలిసే అవకాశం ఉంది. పశ్చిమదిశగా వెళ్లి కజకిస్తాన్‌లో యూరప్, ఆసియా సరిహద్దుల్లో ఉన్న యెకటెరిన్‌బర్గ్‌లోనూ ఇదే నెట్‌వర్క్‌తో చేరొచ్చు. ఈ రెండు మార్గాలను ప్రస్తుతం చైనా ఉపయోగించుకుంటోంది. ఇప్పుడు పశ్చిమ చైనాలోని యున్నన్ రాష్ట్ర రాజధాని కున్‌మింగ్ నుంచి మయన్మార్ బంగ్లాదేశ్, భారత్, పాకిస్తాన్, ఇరాన్, టర్కీ మీదుగా జర్మనీలోని హాంబర్గ్‌కు మరో రైల్వే లైన్ అభివృద్ధి చేసే ప్రతిపాదన కూడా ఉంది.



చైనా నుంచి టెహరాన్‌కు చేరుకున్న గూడ్స్ రైలు



# బామ్మల బడి



వర్ణమాలను దిద్దడానికి వయసు వారికి అడ్డంకి కాలేదు. నేర్చుకోవాలనే వారి తపన ముందు వృద్ధాప్యం పరిగెత్తి పారిపోయింది. ఫలితంగా 'ఆజిబైచి శాల'లో ఇప్పుడు ఆరుపదుల అవ్వలు అక్షరాలు దిద్దుతున్నారు. ఒకరి కోరికగా, మరొకరి మానసపుత్రికగా ఏర్పడ్డ పాఠశాల అది.

మహారాష్ట్రలోని థానె దగ్గర ఉంది ఫాంగన్ గ్రామం. 2016 మార్చి 8 నాడు అంటే మహిళా దినోత్సవం రోజున ఆ గ్రామంలో 'ఆజిబైచి శాల' (బామ్మల బడి) ప్రారంభమైంది. యోగేంద్ర బంగర్ ఈ పాఠశాలను ప్రారంభించారు. ఒకనాడు స్థానిక జిల్లా పరిషత్ పాఠశాలలో ఉపాధ్యాయుడైన బంగర్ దగ్గరకు ఓ ముసలావిడ వచ్చి "నేను ఆధ్యాత్మిక పుస్తకాలు చదువుకోవాలనుకుంటున్నాను. కానీ నాకు చదువురాదు. నాకు అక్షరాలు నేర్పుతారా" అని అడిగింది. అలా ఆ బామ్మ కోరికతో మొదలైన 'ఆజిబైచి శాల'లో ఇప్పుడు మొత్తం 28 మంది బామ్మలు పలకా బలపం పట్టుకుని అక్షరాలతో కుస్తీ పడుతున్నారు. అంతా అరవయ్యేళ్ల నుంచి తొంభయ్యేళ్ల మధ్య వాళ్లే! అందరికంటే పెద్దదైన 90 ఏళ్ల సీతాబాయ్ దేశ్‌ముఖ్ "నా చిన్నతనంలో మేం పేదవాళ్లం. అందులోనూ ఆడవాళ్లకు అసలు స్కూలుకెళ్లే అవకాశమే ఉండేది కాదు. అందుకే నా జీవితంలో బడికి వెళ్లే రోజొకటి వస్తుందని నేనస్సలు ఊహించలేదు. ఈ బడి వల్ల నా కోరిక నెరవేరింది" అని సంబరంగా చెప్పింది.

ముదురు గులాబీరంగు చీరలు ధరించి (స్కూలు యూనిఫాం), ముడతలు పడిన చేతుల్లో భద్రంగా బ్యాగులు దాచుకుని ఠంచనుగా స్కూలుకు వస్తారీ బామ్మలు. చదువులోనూ హుషారుగా ఉంటారు. రిపబ్లిక్ డే రోజున వీళ్ల స్కూలుని ఓ పెద్ద స్థలంలోకి మార్చారు. ఆ స్థలంలో తోట కూడా ఉంది. ఆ తోటలోని చెట్ల బాధ్యతను కూడా బామ్మలకే అప్పగించారు బంగర్.

'మోతీరామ్ దలాల్ ట్రస్టు' సాయంతో ఒక గదిలో పాఠశాలను ప్రారంభించారు బంగర్. అయితే స్కూలుకు కావాల్సిన సామాగ్రిని మాత్రం ఆయన తన సొంత డబ్బుతోనే సమకూర్చారు. ఆయన విరాళాలు స్వీకరించరు. 'స్కూలుకయ్యే ఖర్చు ఏమంత ఎక్కువ కాదు. నేను భరించగలను. అయినా ఇది నా మానసపుత్రిక. పైగా నేను ఉపాధ్యాయుణ్ని. ఇది నా బాధ్యత కూడా" అంటారు బంగర్.

బంగర్ అభ్యర్థనతో గత ఏడాది ఈ స్కూల్లో ఉపాధ్యాయురాలిగా బాధ్యతలు చేపట్టారు శీతల్ మోరె. ఆమె భర్త శీతల్‌ని ప్రోత్సహించడమే కాదు... పాఠశాలకు విశాలమైన స్థలాన్ని కూడా దానంగా ఇచ్చారు. చదువు సంధ్యలు నేర్పించడంతోనే తన పని అయిపోయిందని భావించడం లేదు బంగర్. వారికి పేపరు సంచులు, బొంతలు కుట్టడంలో శిక్షణ ఇవ్వడానికి కూడా ఏర్పాట్లు చేస్తున్నారు. బడి ముఖమే ఎరుగని మహిళలతో మలిసంధ్యలో ఓనమాలు దిద్దిస్తోన్న 'ఆజిబైచి శాల' దేశానికే ఆదర్శమనడంలో అతిశయోక్తి లేదు. ఈ పాఠశాల ద్వారా ఫాంగన్ గ్రామం వందశాతం అక్షరాస్యత కలిగిన గ్రామంగా మారబోవడం మరో విశేషం.

# స్వర మాంత్రికురాలు



మనం ఫోన్ చేసినపుడు అవతలి నుంచి 'ద సబ్‌స్క్రైబర్ యు హ్యావ్ కాల్డ్ ఈజ్ కరెంట్లీ అన్ ఎవైలబుల్, ప్లీజ్ ట్రై ఎగైన్ లేటర్' అంటూ ఓ స్వరం వినిపించడం ఫోన్ వాడే వాళ్లందరికీ అనుభవమే. మధురంగా వినిపించే ఆ స్వరం ఎవరిదో తెలుసా? మేఘనా ఎరండేది. ఎన్నో ప్రఖ్యాత కార్టూను పాత్రల నుండి వినబడేది ఆమె గొంతే. పుణె రైల్వే స్టేషన్‌లో రైలు ఏ ప్లాట్‌ఫామ్ మీదికొస్తుందో తెలిపే తీయని స్వరం కూడా ఆమెదే. డిస్కవరీ, నేషనల్ జాగ్రఫిక్ ఛానల్స్ ప్రోగ్రాముల హిందీ డబ్బింగులకు వాయిస్ ఓవర్ ఇచ్చిందీ ఆమే!

మేఘనా ఎరండేని చూసిన వారెవరికీ ఆ స్వరాలు ఆమెవే అంటే నమ్మబుద్ధి కాదు. మరాఠీ సాహిత్యంలో ఆమె ముంబయి యూనివర్సిటీ టాపర్. అయినా తనలోని ధ్వన్యానుకరణ కళని మరింత సాన బెట్టుకుని ఇలా మన ముందు నిలిచారు. 'నింజా హట్టోరి' కార్టూనులో 'నింజా హట్టోరి' పాత్రకు ఆమె చెప్పిన డబ్బింగ్ అప్పుడే టీనేజ్‌లోకి ప్రవేశించిన అబ్బాయి గొంతులాగా ఉంటుంది. 'బాబ్ ద బిల్డర్ కార్టూన్ సిరీస్‌లో 'డిజ్జీ' క్యారెక్టర్, 'డోరెమాన్'లో 'డోరెమాన్', 'పోకెమాన్'లో 'ఆఫీసర్ జెన్నీ'... ఇలా ఎన్నో కార్టూన్ పాత్రలకు ఆమె డబ్బింగ్ చెప్పారు. కేవలం కార్టూను పాత్రలకే ఆమె ప్రతిభ పరిమితం కాలేదు. సినిమాలు కూడా ఆమె గొంతును వెతుక్కుంటూ వచ్చాయి. కొన్ని హిందీ సినిమాలతో పాటు తమిళ సినిమా 'లింగ'కు హిందీ డబ్బింగ్ వెర్షన్‌లో హీరోయిన్ అనుష్కకు గాత్రదానం చేశారు. ఇవేకాక 'హ్యారీపోటర్ అండ్ ద గోబ్లెట్ ఆఫ్ ఫైర్, 'ద మమ్మీ : టూంబ్ ఆఫ్ ది డ్రాగన్ ఎంపరర్' వంటి మరికొన్ని హాలీవుడ్ సినిమాలకు కూడా పనిచేశారు.

# నా ఇష్టం





ఎఫ్‌బీలో ప్రొఫైల్ పిక్ మహేష్‌బాబు ది పెట్టేఛ్చా. నేనే తిరుమలరావని అంటే నమ్ముతుందో లేదో ?!
ప్రొఫైల్ పిక్ తమన్నాది పెట్టి పొరపాటు చేసా. నేనే నాంచారి అంటే నమ్ముతాడో లేదో ?!




ఈ వీధి చివర కుడి వైపు, మూడో ఇంట్లో కిట్టీపార్టీలో పేకాట జోరుగా సాగుతోంది. వెళ్లి అరెస్ట్ చేయండి సార్!
మొగుళ్లకి కాఫీ కూడా ఇచ్చి చావటంలే !!




ఛి ఛీ... అంతా అవినీతి మయం. రెండు వేలు లంచం తీసుకుంటూ పట్టుబడితే లక్ష లంచం ఇస్తేగాని వదిలి చావలా !!




ఎక్స్‌ట్రా క్వాలిఫికేషన్ అంటే ఇదే. జోకుల్తో బాస్‌ని పడేస్తాడు !!




కట్నం వద్దు పెళ్లి గ్రాండ్‌గా చెయ్యండి అంటే సంతోషించాం... కట్నం ఇచ్చే అమ్మాయి పెళ్లిచేయాల్సిందండీ !!

# జంట హత్యలు

**ముంబయి శివార్లలోని కాండీవాలీ ప్రజలకు నిత్యం నరకం చూపించే మురికి కాలువ చుట్టూ ముక్కులు మూసుకుని చేరారు జనం పెద్దఎత్తున.**

**మురికినీటిలో రెండు కార్డుబోర్డు బాక్సులు తేలుతున్నాయి. ఒక బాక్సు నుంచి సగం మృతదేహం కనిపిస్తోంది. రెండో బాక్సులో ఏముందో అనే ఆత్రుతతో చూస్తున్నారు.**

సమాచారం తెలుసుకుని ముంబయి పోలీసులు నిమిషాల్లో అక్కడికి చేరుకున్నారు.

రెండు బాక్సులనూ బయటకు తీయించారు. రెండో బాక్సులోనూ మృతదేహమే ఉంది. ఒక పురుషుడు, ఒక మహిళ... కాళ్లు చేతులు కట్టేసి, నోటికి టేపు అంటించి, ఎక్కడో హత్య చేసి మృతదేహాలను అట్టపెట్టెల్లో తీసుకొచ్చి ఇక్కడి మురికి కాలువలో పడేసినట్లు గుర్తించారు పోలీసులు.

కంట్రోల్ రూంకు ఫోన్ చేసి మహిళ వయస్సు 40 ఏళ్ల పైన ఉంటుందని, పురుషుని వయస్సు 60కి పైన ఉంటుందని, మిగతా విషయాలతో పాటు ఒంటిపై ఉన్న దుస్తుల వివరాలను కూడా తెలిపారు.

ముంబయిలో ఈ వార్త చాలానే సంచలనం సృష్టించింది. ఎందుకంటే- మృతుల్లో ఒకరు ప్రముఖ ఆర్టిస్టు, జాతీయ లలిత కళా అకాడమి అవార్డు గ్రహీత హేమా ఉపాధ్యాయ. మరొకరు ఆమె న్యాయవాది హరీష్ భంబానిగా తేలింది. వాళ్లిద్దరూ జాతీయ స్థాయిలో పలుకుబడి ఉన్న వ్యక్తులు. విషయం తెలుసుకుని ఢిల్లీలో ఉంటున్న హేమ భర్త చింతన్ ఉపాధ్యాయ ఆ మర్నాడే ముంబయి చేరుకున్నారు. ఆయన కూడా పేరున్న పెద్ద ఆర్టిస్టే. దేశవ్యాప్తంగా మంచి ఫాలోయింగే ఉంది ఆయనకు.

అయితే కొన్నాళ్లుగా హేమ, చింతన్‌లు విడివిడిగా ఉంటున్నారు. విడాకుల కోసం కోర్టుకు కూడా వెళ్లారు. భరణం కావాలంటూ హేమ వేసిన కేసు విచారణ ఇంకా కొనసాగుతూనే ఉంది. అలాంటి సమయంలో హేమ మరణించింది. అంతేకాదు ఈ కేసులో హేమ తరపున వాదిస్తున్న న్యాయవాది హరీష్ భంబాని కూడా హత్య చేయబడ్డాడు.

భర్తే చంపాడా? ముంబయిలో హత్య చేసిన వ్యక్తి ఢిల్లీలో ఎలా ఉన్నాడు? అసలు హత్యలు ఎప్పుడు జరిగాయి? ఎక్కడ జరిగాయి? హరీష్, హేమలు ఒకర్నొకరు ఎప్పుడు కలుసుకున్నారు? ఎక్కడికి వెళ్లారు? ఇలా అన్నీ ప్రశ్నలే.

•••

హేమ, హరీష్‌ల మిస్సింగ్ ఎఫ్ఐఆర్‌లను పరిశీలించడం ప్రారంభించారు ముంబయి అడిషనల్ కమిషనర్ ఫతేసింగ్.

హేమ కనిపించడం లేదంటూ ఆమె ఇంట్లో పనిచేసే నౌకరు లలిత్ మండల్ మొదట పోలీసులకు ఫిర్యాదు చేశాడు. అందేరీ ప్రాంతంలో తన భర్తకు చెందిన ఇంట్లోనే హేమ నివసిస్తోంది. హత్య జరిగిన రోజు సాయంత్రం ఆరున్నర ప్రాంతంలో హేమ తన నౌకరుకు ఫోన్ చేసి పనిమీద బయటికి వెళుతున్నానని, డిన్నర్ బయటే చేస్తానని చెప్పింది.



హరీష్ విషయానికొస్తే ఆయన మాతుంగాలోని తన కింగ్ సర్కిల్ ఇంటి నుంచి సాయంత్రం ఆరుగంటలకు బయటకు వచ్చారు. అందేరీలో ఉన్న క్లయింట్ హేమను కలిసి వస్తానని ఇంట్లోవాళ్లకు చెప్పారు. రాత్రి పదిగంటలైనా హేమ ఇంటికి రాకపోవడంతో నౌకరు లలిత్ ఆమె మొబైల్‌కు ఫోన్ చేశాడు. ఫోన్ స్విచ్చాఫ్ అని వచ్చింది. లలిత్ కంగారు పడి వెంటనే హేమ బంధువులకు, స్నేహితులకు ఫోన్ చేసి ఆమె ఫోన్ స్విచ్చాఫ్ వస్తోందని, ఇంకా ఇంటికి రాలేదని చెప్పాడు. వారి సూచన మేరకు పోలీస్‌స్టేషన్‌కు వెళ్లి తన యజమాని కనిపించడం లేదని పోలీసులకు ఫిర్యాదు చేశాడు.

హరీష్ రాత్రి ఎనిమిదిన్నర సమయంలో ఇంటికి ఫోన్ చేసి తాను రావడానికి ఇంకొంత సమయం పడుతుందని కుమార్తె అనితకు చెప్పారు. ఆ తర్వాత పదైనా ఆయన ఇంటికి చేరుకోలేదు. దాంతో అనిత తండ్రికి ఫోన్ చేసింది. ఆయన ఫోన్ స్విచ్చాఫ్ రావడంతో ఆందోళన చెందిన అనిత వెంటనే హేమ నంబర్‌కు కాల్ చేసింది. హేమ ఫోన్ కూడా స్విచ్చాఫ్ రావడంతో తన తండ్రి కనిపించడం లేదంటూ ఆమె కూడా పోలీసులకు ఫిర్యాదు చేసింది. వివరాలను పరిశీలించిన అడిషనల్ కమిషనర్ ఫతేసింగ్ మనసులో కొన్ని అనుమానాలు ప్రారంభమయ్యాయి. అప్పటికే కేసు దర్యాప్తు ప్రారంభించిన క్రైమ్ డీసీపీ ధనుంజయ కులకర్ణిని తన వద్దకు రమ్మని కబురు చేశారాయన.

•••

"సార్... ఈ కేసులో ఒక కీలకాధారం దొరికింది. కాండీవాలీకి కార్డు బోర్డు బాక్సులను ఒక ట్రాలీలో తీసుకువచ్చినట్లు గుర్తించాం" అన్నారు డీసీపీ కులకర్ణి.

"అలాగా... అయితే ఆ ట్రాలీ డ్రైవర్ ఎవరో తెలుసుకోండి" అని అడిషనల్ కమిషనర్ ఫతేసింగ్ అంటుండగా లోపలికి వచ్చి డీసీపీ విక్రం దేశ్‌ముఖ్ ఈ కేసులో తనకు కూడా ఒక ఆధారం దొరికిందని చెప్పారు.

" లాయర్ హరీష్ అందేరీలోని హేమకు చెందిన స్టూడియోలో ఆమెను కలిశారు. అక్కడి నుంచి తొమ్మిది గంటల ప్రాంతంలో మరో చోటికి వెళ్లినట్లుగా తెలుస్తోంది. అంతేకాదు హేమకు సాయంత్రం ఆరుగంటలనుంచి ఎనిమిదిన్నర లోపు ఒక నెంబర్ నుంచి నాలుగు సార్లు ఫోన్ కాల్స్ వచ్చాయి. ఆ నెంబర్‌కు చెందిన వ్యక్తి వీరి హత్యల తర్వాత ఫోన్ స్విచ్చాఫ్ చేసుకున్నాడు. అతన్ని పట్టుకోవడం కోసం ప్రయత్నిస్తున్నాం. హేమ, హరీష్, వారికి ఫోన్ చేసిన వ్యక్తి ఈ ముగ్గురి సెల్‌ఫోన్ల టవర్ లోకేషన్లు ఒకే ప్రాంతాన్ని సూచిస్తున్నాయి. అంటే ఈ ముగ్గురూ ఒకచోట కలుసుకున్నారన్నది స్పష్టం అవుతోంది" అన్నారు దేశ్‌ముఖ్.

" సో... ఫోన్ చేసిన ఆ మూడో వ్యక్తిని, ఆటో ట్రాలీ డ్రైవర్‌ను పట్టుకుంటే మనకు మరికొంత క్లూ దొరకొచ్చు" అంటూ ఫతేసింగ్ డీసీపీలకు కొన్ని సూచనలు చేశారు.

•••

కార్డు బోర్డు బాక్సుల మీద ఉన్న మాన్యుఫ్యాక్చరింగ్ నెంబర్ ఆధారంగా ఆ బాక్సులని ఎవరు కొన్నారు అన్న విషయాన్ని తెలుసుకోవడం కోసం ఓ పోలీస్ బృందం రంగంలోకి దిగింది.

అందేరీ నుంచి కాండీవాలీకి సుమారు నలభై కిలోమీటర్ల దూరం. ఆ ప్రాంతంలో కార్డు బోర్డు బాక్స్‌లతో ప్రయాణించిన ఆటోని గుర్తించడం కోసం ఆ రూట్లో ఉన్న సీసీ కెమెరాల్లోని విజువల్స్ ను జల్లెడ పట్టడం ప్రారంభించింది మరో బృందం.

హత్యలు రాత్రి తొమ్మిది తర్వాత జరిగినట్లు వైద్యులు ప్రాథమికంగా నిర్ధారించారు.

మృతదేహాలను ఆ మర్నాడు ఏడున్నర ప్రాంతంలో స్థానికులు గుర్తించారు. అంటే రాత్రి తొమ్మిది తర్వాతే మృతదేహాలను రవాణా చేసి ఉండాలి. పోలీసులు సీసీ కెమెరాలను పరిశీలిస్తుండగా వారికి

ఓ చిన్న క్లూ లభించింది. ఆటో ట్రాలీ నడుపుతున్న వ్యక్తిని సీసీ పుటేజ్ ద్వారా గుర్తించారు.

వెంటనే అతని కోసం గాలించి డ్రైవర్ విజయ్‌ను కొద్ది గంటల్లోనే పోలీసులు పట్టుకున్నారు. తనకే పాపం తెలీదని, పగిలిపోయిన కొన్ని కళాఖండాలు ఆ పెట్టెల్లో ఉన్నాయని, వాటిని తీసికెళ్లి కాలువలో పడేయాలని తనకు చెప్పారని, తనకు అంతే తెలుసని విజయ్ పోలీసులతో చెప్పాడు. విజయ్ మాటలను విశ్వసించని పోలీసులు అతని సెల్‌ఫోన్ కాల్ డీటెయిల్స్‌ను పరిశీలించారు.

అప్పుడు బయటపడింది మరో పేరు. అది విద్యాధర్ అనే పేరు. అంధేరీలో హేమ లాగానే మరో ఆర్ట్ స్టూడియో నిర్వహిస్తుంటాడతను. విద్యాధర్ ఫోన్ నుంచి ఆటో ట్రాలీ డ్రైవర్ విజయ్‌కు ఆ రోజు అనేకసార్లు ఫోన్లు వెళ్లాయి.

" ఈ హత్యలతో మీ ఇద్దరికీ ఉన్న సంబంధం ఏమిటి?" అంటూ పోలీసులు రెండు పీకేసరికి విజయ్ నోరు విప్పాడు.

•••

విజయ్ నోటి నుంచి ఒక్కోమాట వెలువడుతుంటే పోలీసులు బృందాలుగా విడిపోయి నేరస్థులను పట్టుకునేందుకు వేట ప్రారంభించారు. మొదట ఉత్తరప్రదేశ్ డీజీపీతో మాట్లాడారు. కొద్ది గంటల్లోనే యూపీలో దాగున్న ఒకర్ని, ముంబాయి మూలల్లో నక్కిన మరో ఇద్దర్నీ పోలీసులు పట్టుకొచ్చి ఫతేసింగ్ ముందు నిల్చోబెట్టారు.

అప్పటికి జంట హత్యలు జరిగి వారం రోజులైంది... ఢిల్లీ నుంచి వచ్చిన హేమ భర్త చింతన్‌ను ముంబయి క్రైమ్‌బ్రాంచ్ పోలీసులు ప్రతి రోజూ ప్రశ్నిస్తూనే ఉన్నారు. మాతుంగా పోలీస్ స్టేషన్‌లో సీనియర్ పోలీస్ అధికారులంతా మకాం వేశారు. తానే హేమను, హరీష్‌ను హత్య చేయించినట్లు విద్యాధర్ అంగీకరించాడు. ఆర్థిక లావాదేవీల నేపథ్యంలోనే ఈ హత్యలు జరిగాయన్నాడు.

" ఏమిటి నీ సమస్య? ఎందుకురా రెండు ప్రాణాలు తీసావ్?" అంటూ ఫతేసింగ్ లాఠీతో విద్యాధర్ వీపు మీద రెండు దెబ్బలు వేశాడు.

" సార్... నేను, హేమ ఒకే రకమైన వ్యాపారంలో ఉన్నాం. ఆమె ఆర్టిస్ట్. ఆమె వేసిన చిత్రాలకు మంచి గిరాకీ ఉంది. ఆ చిత్రాలను నేను అందమైన ఫోటోఫ్రేమ్స్‌లో అమర్చేవాడిని. చాలామంది ఆర్టిస్టులతో నాకు పరిచయాలున్నాయి. ముంబయిలోని సగం మంది ఆర్టిస్టులకు నేనే ఫోటో ఫ్రేమ్స్ సరఫరా చేస్తుంటా. రెండేళ్ల క్రితం హేమ నుంచి రెండు లక్షల రూపాయలు నేను అప్పుగా తీసుకున్నా. తర్వాత మరికొంత తీసుకున్నా. మొత్తం ఐదు లక్షలయింది. డబ్బు తిరిగి ఇవ్వమని హేమ ఒత్తిడి పెడుతోంది. ఆమెకు డబ్బు తిరిగి ఇవ్వలేకే మా గోడౌన్‌లో హత్య చేయించాను" అని విద్యాధర్ తన వాంగ్మూలాన్ని ముగించాడు.

విద్యాధర్ చెప్పిన విషయాలపై ఫతేసింగ్‌కు నమ్మకం కలగలేదు.

విద్యాధర్ కాల్‌లిస్ట్‌లో హేమ భర్త చింతన్ నెంబర్లు ఉండటం, హత్యకు రెండు రోజుల ముందు వీరిద్దరూ కలుసుకున్నట్లు టవర్ లొకేషన్స్ స్పష్టం చేయడంతో తమదైన పద్ధతుల్లో విద్యాధర్‌ను మరోసారి విచారించారు పోలీసులు. అయితే చెప్పిన మాటలే పదే పదే చెబుతూ పోలీసులను విసిగించాడు విద్యాధర్. చేసేదేం లేక విద్యాధర్‌ను ముంబయి క్రైమ్ బ్రాంచ్‌కు తీసుకెళ్లారు.

•••

ముంబయి క్రైమ్ బ్రాంచ్ కార్యాలయంలోని ఓ గదిలో విద్యాధర్‌ను కూర్చోబెట్టి, ఆ గదిలోకి చింతన్‌ని తీసుకొచ్చారు. ఈసారి ఇద్దర్నీ ఒకే చోట ఉంచి మళ్లీ విచారణ ప్రారంభించారు.

" చూసావ్‌గా చింతన్ మాకు అంతా చెప్పాడు. నువ్వు పెదవి విప్పకపోతే, అసలు సంగతి చెప్పకపోతే నీ ఇష్టం... క్రైమ్‌బ్రాంచ్ పోలీసుల గురించి నువ్వు వినే ఉంటావ్..." అంటూ మైండ్‌గేమ్ ప్రారంభించారు. చింతన్, విద్యాధర్‌లు పోలీస్ వ్యూహాన్ని అర్థం చేసుకోలేక చివరికి అసలు విషయం వెల్లడించారు.

మర్నాడు విలేఖరుల సమావేశంలో కమిషనర్ ఫతేసింగ్ పూర్తి వివరాలు తెలిపారు.

" హేమను హత్య చేసింది కిరాయి హంతకులే కానీ చేయించింది ఆమె భర్త చింతన్. అయితే ఆర్ట్‌హౌజ్ యజమాని విద్యాధర్ ఆ కిరాయి హంతక ముఠా నాయకుడు. అంటే ఈ కేసులో భర్తే హంతకుడు..."

"వారిద్దరూ విడిపోయారు కదా. పైగా లాయర్‌ను ఎందుకు చంపాల్సి వచ్చింది?" ఓ విలేఖరి ప్రశ్నించాడు.

" హేమకు భరణం ఇవ్వకూడదనుకున్నాడు ఆమె భర్త చింతన్. అందుకే ఒక స్కెచ్ వేశాడు. చింతన్ ఓ మహిళతో సన్నిహితంగా ఉన్న వీడియో తన వద్ద ఉందని, ఆ వీడియో కావాలంటే రెండు లక్షలు ఇవ్వాలని, డీల్ ఓకే అయితే తెచ్చి ఇస్తానని వేరే ఫోన్‌నెంబర్ నుంచి విద్యాధర్ హేమకు ఫోన్ చేశాడు విద్యాధర్. హేమ వెంటనే తన ఫ్యామిలీ లాయర్ హరీష్‌కు ఫోన్ చేసి తనకొచ్చిన ఫోన్ గురించి చెప్పింది. చింతన్‌కు సంబంధించిన అటువంటి వీడియో దొరికితే విడాకులు, భరణం కేసులో తమకు సులువవుతుందని, డబ్బు ఇచ్చైనా దాన్ని కొందామని సలహా ఇచ్చారు హరీష్. తనను తోడు రమ్మని హేమ కోరడంతో హరీష్ ఆమె వద్దకు ఇద్దరూ కలిసి ఫోన్ చేసిన వ్యక్తి సూచించిన ప్రాంతానికి వెళ్లారు. హరీష్‌ను చంపాలన్న ప్లాన్ లేదు కాని ఆమెతో వెళ్లడం వలన అతని ప్రాణానికీ ముప్పు ఏర్పడింది. వారి కారు ఒక గోదాంలోకి వెళ్లగానే కిరాయి హంతకులు ఇద్దర్నీ చంపేశారు. ఆ తర్వాత మృతదేహాలను కార్డు బోర్డు పెట్టెలో పెట్టి కాందీవాలీ కాలువలో పడేయించారు. ఒకవేళ పోలీసులకు తాము దొరికితే నేరం తమ మీదే వేసుకుంటామని. చింతన్ పేరు బయటకు రానివ్వమని విద్యాధర్‌కు హామీ ఇచ్చాడు. హేమను చంపేందుకు చింతన్‌తో 22 లక్షల రూపాయలకు కాంట్రాక్ట్ కుదుర్చుకున్నాడు విద్యాధర్. ఆ రోజు హేమకు తోడుగా వచ్చినందుకే న్యాయవాది హరీష్ ప్రాణాలు కోల్పోవలసి వచ్చింది. అందుకే విద్యాధర్ చాలాసేపు తానే నేరం చేశానని, ఇంకెవరికీ సంబంధం లేదని మమ్మల్ని బురిడీ కొట్టించడానికి ప్రయత్నించాడు. ఇక చింతన్ అయితే అమాయకపు చక్రవర్తి లాగా అనుక్షణం తనకే పాపం తెలీదంటూ స్టేట్ మెంట్ ఇచ్చాడు.

నేరం అనేది ఎప్పటికీ దాగదు. ఏదో క్లూ దొరుకుతూనే ఉంటుంది. సెల్‌ఫోన్ కాల్‌లిస్ట్ ఇందులో కీలకం. ఇంకో సర్‌ప్రైజింగ్ న్యూస్ ఏమిటంటే హేమను ఎలా చంపాలి? ఎలా టార్చర్ చేయాలి? అనే విషయాలపై బొమ్మలు గీసి మరీ భద్రంగా డైరీలో పెట్టుకున్నాడు చింతన్. వాటిని మేము స్వాధీనం చేసుకున్నాం. అసలు చింతన్, హేమ ఎందుకు విడిపోయారో తెలుసా? చింతన్ మహిళల నగ్న చిత్రాలను బెడ్ రూంలోని గోడల మీద గీసేవాడు. 'నీ చిత్రాలు కూడా ఇలాగే వేస్తా...' అంటూ భార్యతో చింతన్ ఉన్మాదిలాగా ప్రవర్తించేవాడు. అందుకే ఆమె విడాకులు కోరింది. భరణం కింద కోటిరూపాయలు కావాలంది. కానీ హేమకు డబ్బు ఇవ్వడం ఇష్టంలేక ఆమెను ఈ లోకం నుంచే శాశ్వతంగా పంపించేయాలని విద్యాధర్ ద్వారా ఈ హత్య చేయించాడు" అంటూ విలేఖరుల సమావేశాన్ని ముగించారు ఫతేసింగ్.

**- వేముల సత్యనారాయణ, 99854 88800**



# చాయ్ విత్ బిస్కెట్స్..

గరం చాయ్‌తో పాటు బిస్కెట్స్ తినడం చాలామందికి అలవాటు. అయితే బిస్కెట్లను పెట్టడం కోసం విడిగా ప్లేట్లు లేదా సాసర్లు వాడాల్సి ఉంటుంది. ఈ 'సూప్ అండ్ క్రాకర్స్ మగ్' (SOUP AND CRACKER MUG)లో అయితే చాయ్‌తో పాటే బిస్కెట్స్‌ను కూడా ఒకేదాంట్లో పక్కపక్కనే పెట్టి ఇవ్వొచ్చు. చూడడానికి అందంగా ఉండడంతో అతిథులకు కూడా బాగా నచ్చుతాయి ఇవి. చాయ్, బిస్కెట్లకు మాత్రమే కాకుండా స్నాక్స్ తింటూ వేడి వేడి సూప్స్ వంటి వాటిని తాగేందుకు కూడా ఇవి ఉపయోగపడతాయి. అతిథుల ముందు తమ ప్రత్యేకతను చూపించుకోవాలనుకునే వారికి ఈ మగ్స్ బాగా ఉపయోగపడతాయి.




ఈ వస్తువులను వాటి పేరుతో నెట్‌లో సెర్చ్ చేసి, వివిధ ఆన్‌లైన్ సంస్థల ద్వారా కొనుగోలు చేయవచ్చు.

# డబుల్ బాక్సు..

దీని పేరు 'ప్రోగ్రెసివ్ బెర్రీ కీపర్' (Progressive Berry Keeper). సాధారణ బాక్సులా కనిపించే డ్యూయల్ సైడ్ బాక్సు ఇది. దీనిలో రెండు వైపులా రెండు రకాల పదార్థాలను పెట్టుకోవచ్చు. ఒకవైపు ఉన్న పదార్థాలను తీసేటప్పుడు మరోవైపు ఉన్న పదార్థాలు కిందపడిపోకుండా 'కీ' ద్వారా లాక్ చేసుకోవచ్చు. పదార్థాలను కొన్ని రోజుల వరకు తాజాగా ఉంచడం ఈ బాక్సులకు ఉన్న మరో ప్రత్యేకత. పిల్లలకు స్నాక్స్ పెట్టి ఇచ్చేందుకు కూడా ఈ బాక్సులు బాగా ఉపయోగపడతాయి.




# మిల్క్ బౌల్



పాలలో రకరకాల కార్న్‌ఫ్లేక్స్‌ను వేసుకుని తింటుంటారు చాలామంది. అయితే అన్నిటినీ ఒకేసారి వేసుకుని తింటే మెత్తబడిపోయి రుచి బాగోవు. కొన్నికొన్ని కలుపుకుని తింటుంటే బాగుంటుంది. ప్రతిసారీ వాటికోసం లేచి వెళ్లాలంటే కష్టం కాబట్టి ఒకేసారి రెండూ వేసేసుకుంటారు చాలామంది. 'ఓబోల్ బౌల్' (Obol Bowl)లో రెండు అరలు ఉంటాయి. కాబట్టి ఒకవైపు పాలు పోసుకుని మరోవైపు నచ్చిన కార్న్‌ఫ్లేక్స్, బిస్కెట్లు వంటి వాటిని పెట్టుకోవచ్చు. తింటూ కలుపుకోవచ్చు.. కలుపుకుంటూ తినొచ్చు.



## హెర్పీస్, గనేరియాలకు సరైన వైద్యం

**హెర్పిస్ :** పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలి ఎర్రగా పుండు పడుతుంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఇటువంటి వ్యాధిని హెర్పిస్ అని అంటారు. లైంగిక కలయిక ద్వారా వచ్చే ఈ వ్యాధి పదే పదే వస్తూ బాధిస్తుంది. రోగనిరోధక శక్తి తగ్గినపుడు మళ్లీ కనిపిస్తుంది. కొన్నిసార్లు ఒకటి రెండు సంవత్సరాల తరువాత బయటపడవచ్చు. ఈ వ్యాధి ఉన్నా ప్రాణహాని మాత్రం ఉండదు. స్త్రీలలో యోని మీద చిన్న చిన్న పొక్కులలాగా వచ్చి ఎర్రగా మారి విపరీతమైన నొప్పి రావడానికి ఆస్కారం ఉంటుంది.

**గనేరియా :** యుక్తవయస్సు వారిలో ఎక్కువగా కనిపిస్తుంది. జననాంగాలు, నోరు, ఆనస్ వరకు వ్యాప్తి చెందుతుంది. భాగస్వామిలో ఒకరికి ఈ వ్యాధి ఉన్నా మరొకరికి సంక్రమిస్తుంది. గర్భిణిగా ఉన్నప్పుడు గనేరియా ఉంటే పిల్లలకు వచ్చే అవకాశం ఉంటుంది. మూత్రంలో మంట, ద్రవం కారడం, దుర్వాసన వంటి లక్షణాలు కనిపిస్తాయి. స్త్రీలలో నెలసరి మధ్యలో రక్తస్రావం, మూత్రనాళంలో మంట, గర్భకోశ వ్యాప్తి ద్వారా సంతానలేమి, అండాశయ వాపు, గర్భకోశ వాపు, ట్యూబులు మూసుకోవడం జరుగుతుంది.

**హోమియో చికిత్స**

హోమియో చికిత్స మానసిక, శారీరక లక్షణాలపై ఆధారపడి పనిచేస్తుంది. రోగనిరోధక వ్యవస్థను శక్తి వంతం చేసి మూల కారణాన్ని గుర్తించి సమూలంగా నిర్మూలిస్తుంది. అనుభవజ్ఞులైన వైద్యుని పర్యవేక్షణలో మందులు వాడితే లైంగిక సమస్యలు సులభంగా పోతాయి.

## కాలేయ జబ్బుకు కచ్చితమైన చికిత్స

**ఒకరోజు** సుమారు 45 సంవత్సరాల వయస్సున్న ఒక వ్యక్తి మా క్లినిక్‌కు వచ్చాడు. అతన్ని చూడగానే తీవ్రమైన జబ్బుతో బాధపడుతున్నాడని అర్థమైంది. విషయం ఏంటని అడిగితే ఇలా చెప్పుకొచ్చాడు. "ఆరు నెలల క్రితం కడుపు నొప్పి మొదలయింది. పరీక్ష చేయిస్తే కామెర్లన్నారు. మందులు వాడాను. కానీ ఫలితం లేదు. ఆకలి బాగా తగ్గిపోయింది. వాంతి వస్తున్నట్లుగా ఉంటుంది. ఒళ్లంత నొప్పులు, మూత్రం పచ్చగా వస్తోంది. పొట్ట కూడా ఉబ్బుగా ఉంటోంది. కాళ్లు వాస్తున్నాయి" అని తన బాధనంత వివరించాడు. ఆల్కహాల్ తాగే అలవాటు ఉందా? అంటే ఉందని అన్నాడు. గత రిపోర్టులను చూస్తే జాండిస్ అని తెలుస్తున్నా హెపటైటిస్ ఉందేమో ఒకసారి కన్‌ఫార్మ్ చేసుకోవడం మంచిదని చెప్పా. ఈ పరీక్షలన్నీ చేయించి రిపోర్టులతో మళ్లీ వచ్చి కలువు అని చెప్పా. సాయంత్రం రిపోర్టులతో వచ్చాడు. నేను ఊహించినట్టుగానే హెపటైటిస్ ఉన్నట్లుగా తేలింది. అదే విషయాన్ని ఆయనకు చెప్పా. భయపడాల్సిన అవసరం లేదని మంచి మందులున్నాయని ధైర్యం చెప్పి క్రమం తప్పకుండా సూచించిన మందులు వాడమన్నా.

**చికిత్స తరువాత :** హెపటైటిస్ వైరస్‌ను సమర్థవంతంగా అడ్డుకునే చికిత్స హోమియో విధానంలో ఉంది. వైరల్ లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది. కాలేయ సమస్యలకు హోమియో మందులు బాగా పనిచేస్తాయి. చికిత్స మొదలు పెట్టిన నెల రోజుల్లోనే మంచి ఫలితం కనిపించింది. మూడు నెలల తరువాత ఆకలి బాగా పెరిగిందని చెప్పుకొచ్చాడు.

**Dr. K Ravikirane**

**M.D.,M.sc(psych), P.G(virology)LONDON**

**గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్**

**మాస్టర్స్ హోమియోపతి**

**అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్, విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి**

**ఫోన్ : 7842 106 106, 9032 106 106**

**V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి**

**సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి**

**10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 3:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.**



## హెచ్‌ఐవిని వాళ్లు జయించారు

**ఎన్నో** ఆశలతో పెళ్లి చేసుకుని దాంపత్య జీవితంలోకి అడుగుపెట్టిన వారికి ఆరు నెలల తిరగకముందే ఊహించని విషయం బయటపడింది. ఆత్మహత్య చేసుకుందామనుకున్న ఆ దంపతులకు హోమియోతో కొత్త జీవితం మొదలయింది. ఆ కేస్‌స్టడీ వివరాలు.

హిందూపురంకు చెందిన ఆదికి శిరీషతో వివాహం అయింది. ఎంతో ముచ్చటైన జంట. ఇద్దరి మధ్య ఎటువంటి అమరికలు లేవు. పెళ్లయిన ఆరు నెలల తరువాత శిరీష గర్భవతి అయింది. హాస్పిటల్‌కు వెళితే పరీక్షలన్నీ చేశారు. అప్పుడే ఒక నిజం బయటపడింది. శిరీషకు హెచ్‌ఐవి పాజిటివ్ అని. ఒక్కసారిగా ఆ దంపతుల కలలన్నీ కల్లలయి పోయినట్టుగా అనిపించాయి. అబార్షన్ చేయించుకోవాలా? చేయించుకుంటే అందరికీ ఏం సమాధానం చెప్పాలి? తాము మాత్రం బతికి సాధించేదేంటి? ఇలాంటి ఆలోచనలెన్నో వాళ్ల మదిలో తొలిచేసేవి. చివరకు ఆత్మహత్య చేసుకోవడం ఒక్కటే మార్గమని నిర్ణయానికి వచ్చారు. ఆ పరిస్థితిలో వాళ్ల తల్లిదండ్రులు వారిని మా క్లినిక్‌కు తీసుకువచ్చారు.

హెచ్‌ఐవి పేరు వింటనే తెలియని భయం కలగడం సహజమే. ఎందుకంటే చికిత్స లేని వ్యాధి అది. నిజమే. కానీ ఇప్పుడు అద్భుతమైన మందులు అందుబాటులోకి వచ్చాయి. వైరస్ పూర్తిగా శరీరంలో నుంచి తొలగిపోకపోయినా ఆ వైరస్ ఎటువంటి ప్రభావం చూపకుండా చేసే హోమియో మందులున్నాయి. హోమియో చికిత్స రోగనిరోధక వ్యవస్థను శక్తివంతం చేస్తుంది. సీడీ 4 కణాల సంఖ్య గణనీయంగా పెరుగుతుంది. ఆకలి బాగా పెరగడంతో బరువు పెరగడం ప్రారంభిస్తారు. హోమియో ద్వారా అందరిలా సాధారణ జీవితం గడిపే అవకాశం లభిస్తుంది. ఇదే విషయాన్ని వారికి వివరించి చికిత్సను అందించా. ఇప్పుడా దంపతులకు ఒక పాప. వాళ్లు ఏ సమస్య లేకుండా హాయిగా ఉన్నారు.

## ఆరు నెలల్లో వెరికోస్ వీన్స్ మాయం

**మిర్యాలగూడ** నుంచి 55 ఏళ్ల వ్యక్తి ఒకరు ఒకరోజు మా క్లినిక్‌కు వచ్చాడు. సమస్య ఏంటని అడిగితే కాళ్లు చూపించాడు. కాళ్ల పిక్కల భాగంలో నరాలు ఉబ్బిపోయి నీలం రంగులో కనిపిస్తున్నాయి. ఏం పనిచేస్తారని అడిగితే వ్యవసాయం అని చెప్పాడు. ఎప్పటి నుంచి ఇలా ఉంది అని అడిగితే చాలా ఏళ్లుగా ఉందని, ఈ మధ్యకాలంలో ఎక్కువయిందని చెప్పుకొచ్చాడు. దానివల్ల ఎటువంటి ఇబ్బంది లేకపోవడంతో పట్టించుకోలేదు అని అన్నాడు. ఇప్పుడు కాళ్లు బాగా లాగుతున్నాయిని, దురద ఉంటోందని అన్నాడు. భయపడాల్సిన పనిలేదని, ఈ సమస్యను వెరికోస్ వీన్స్ అంటారని చెప్పాను. కొంతకాలం మందులు వాడితే తగ్గిపోతుందని చెప్పాను. కాలి పిక్కల భాగంలో ఉండే నరాల (సిరలు) మెలిపడటం వల్ల ఈ సమస్య ఉత్పన్నమవుతుంది. సాధారణంగా రక్తం ఉపరితల సిరల నుంచి డీప్ వెయిన్స్‌కు, అక్కడ నుంచి గుండెకు సరఫరా అవుతుంది. అయితే ఈ ప్రక్రియ విఫలమైనప్పుడు రక్తం ఉపరితల సిరల్లోనే నిలిచిపోతుంది. ఫలితంగా సిరలు ఉబ్బిపోతాయి.

**హోమియో చికిత్స తరువాత**

ముందుగా ఒక నెలరోజులకు మందులు ఇచ్చి వాడమని చెప్పాను. సరిగ్గా చెప్పినట్టుగా ఆరునెలల పాటు మందులు వాడాడు. దాదాపు 90 శాతం వరకు సమస్య తగ్గిపోయింది. కాళ్లు లాగడం, దురద వంటివి తగ్గిపోయాయి. చాలా మంది ఈ సమస్యకు చికిత్స లేదని వైద్యుల దగ్గరకు వెళ్లకుండా ఉండిపోతారు. కానీ హోమియో వైద్యంతో వెరికోస్ వీన్స్ సమూలంగా తొలగిపోతుంది. హోమియోలో మూలకారణాన్ని తొలగించే విధంగా చికిత్స ఉంటుంది. కాబట్టి వ్యాధి నుంచి పూర్తిగా విముక్తి లభిస్తుంది. పైగా ఎటువంటి దుష్ప్రభావాలు ఉండవు.

ADVT



## బుచికి

జిరాఫీట మాలాగ ఎలిమెంటరీ స్కూల్లో కికుండి డైరెక్ట్‌గా హై స్కూలులోనే చదువుతీయనుకుంటూ...



## 'ఆట్టో' అదుర్స్!



ఆ బుల్‌డాగ్ పేరు ఆట్టో (Otto). స్కేట్‌బోర్డ్ ఎక్కి రోడ్డుపై రివ్వున దూసుకుపోవడం దాని స్పెషాలిటీ. ఒకసారి దాని యజమానురాలు లూసియానా... టిల్‌మాన్ అనే మరో బుల్‌డాగ్ స్కేట్‌బోర్డ్ సర్ఫింగ్‌లో గిన్నిస్ రికార్డులకెక్కిన వార్త చూసింది. మా 'ఆట్టో' కూడా బ్రహ్మాండంగా స్కేట్‌బోర్డు సర్ఫింగ్ చేయగలదు కదా... దానిని కూడా గిన్నిస్ రికార్డులకెక్కించాలని తలపోసి 30 మందితో ఆమె ఒక హ్యూమన్ టన్నెల్‌ని ఏర్పాటు చేసింది. అంటే ఆ 30మంది కాళ్లు వెడల్పుగా చాచి నుంచుంటే ఆట్టో స్కేట్‌బోర్డుపై వాళ్ల కాళ్ల మధ్య నుంచి ప్రయాణించాలి. తన యజమానురాలు పెట్టిన పరీక్షకు ఏమాత్రం వెరవకుండా 'ఆట్టో' ఆ ఫీట్ సాధించి గిన్నిస్ రికార్డులకెక్కింది.

## రంగులు వేయండి

## నా బొమ్మ



యం. ఆకాష్
LKG,
శ్రీ భావన విద్యానికేతన్
విశాఖపట్టణం



## భూగర్భ గృహాలు



మనిషి ఆకాశహర్మ్యాల్లో నివసిస్తోన్న ఈ కాలంలో ఇంకా నేలమాళిగల్లో ఇళ్లు కట్టుకునేవాళ్లు ఉన్నారని మీకు తెలుసా? ఆఫ్రికాకు ఉత్తరం వైపుండే ట్యునీసియా దేశంలో మత్‌మాతా (Matmata) అనే పట్టణం ఉంది. ఆ పట్టణంలో జీవిస్తున్న వాళ్లను 'ట్రోగ్లొడైట్' (Troglodyte)లు అంటారు. అంటే గుహల్లో నివసించేవారని అర్థం. 2014లో ఈ పట్టణ జనాభా 2116 మంది మాత్రమే! వీళ్లు 'బెర్బర్' అనే అరుదైన భాషను మాట్లాడతారు. భూమిలోపల ఇళ్లు నిర్మించుకుంటారు. ఒక ఇంటికి మరో ఇంటికి మధ్య సొరంగాలు నిర్మించుకుంటారు. వర్షాలు వచ్చి మధ్యమధ్యలో ఇళ్లు కూలిపోయినా చాలామంది ఇళ్ల నిర్మాణంలో ఇంకా తమ పూర్వీకుల పద్ధతినే అనుసరిస్తున్నారు. పర్యాటకం వీరి ప్రధాన ఆదాయ వనరు. 1976లో 'స్టార్‌వార్స్ ఎపిసోడ్ ఫోర్ : ఎ న్యూ హోప్' అనే సినిమాలో కొంత భాగాన్ని ఇక్కడ షూట్ చేశారు.

## క్యాసోవరి (Cassorwary)

పపువా న్యూ గినీ, ఇండోనేషియా, ఉత్తర ఆస్ట్రేలియా దేశాల్లో కనిపించే అందమైన, బిడియస్తురాలైన పక్షి క్యాసోవరి. ఇది పక్షే గాని ఎగరలేదు. దీని ప్రధాన ఆహారం పళ్లు, గింజలు. కొన్నిసార్లు చిన్న చిన్న జంతువులనూ వేటాడుతుంది. అందంగా, అమాయకంగా ఉంది పట్టుకుందాం అని ఎవరైనా దగ్గరికెళితే మాత్రం వారి ప్రాణానికి ముప్పు ఏర్పడే ప్రమాదముంది. దీని కాలి గోర్లు ఆపరేషన్ బ్లేడులంత పదునుగా ఉంటాయి. ఒకసారి తగిలితే చాలు లోతైన గాయమవుతుంది. అందుకే వీటితో జాగ్రత్తగా ఉండాలని చెపుతారు.



## తెలివైన మార్జాలం



'రెడ్‌లైట్ పడే వరకూ వేచి ఉండండి. వాహనాలు ఆగిన తర్వాత జీబ్రా క్రాసింగ్‌లోనే రోడ్డు దాటండి' - ఇలాంటి ట్రాఫిక్ రూల్స్‌ను మనుషులు పాటించినా, పాటించకపోయినా ఓ మార్జాలం మాత్రం బహు జాగ్రత్తగా పాటిస్తోంది. ఈ ఇంగ్లండు పిల్లి ఒకరోజు రోడ్డు దాటడానికి వచ్చి వాహనాలు వెళ్లిపోయేవరకూ ఆగి గ్రీన్‌లైట్ పడ్డాకే జీబ్రా గీతల మీదే రోడ్డు దాటింది. యుకెలోని కెంట్ రాష్ట్రం డార్ట్‌ఫోర్డ్ నగరంలోని ఓ రోడ్డుపై కనిపించింది ఈ అరుదైన దృశ్యం. ఏ మాత్రం ఆలస్యం చేయకుండా జస్టిన్ స్ర్కటన్ అనే కారు డ్రైవరు తన కెమెరాలో ఆ సంఘటనను రికార్డు చేశాడు. ఈ వీడియోని స్కూళ్లకు పంపి పిల్లల్లో ట్రాఫిక్ రూల్స్ పట్ల అవగాహన కల్పిస్తున్నారట అక్కడి ట్రాన్స్‌పోర్ట్ అథారటీ అధికారులు.

## చుక్కలు కలపండి



## మీకు తెలుసా..!

- పావురంలో ఎముకల బరువు కంటే ఈకల బరువే ఎక్కువ.
- రక్తపోటు అధికంగా ఉండే జంతువు జిరాఫీ
- షార్కులు నిద్రలో కూడా కదలడం మానవు.
- వర్షపు నీటిలో విటమిన్ బి 12 ఉంటుంది.
- కొన్నిరకాల నత్తలు నిర్విరామంగా మూడేళ్ల పాటు నిద్రపోతాయి.
- అంతరిక్ష నౌకలో తొలిసారి సాగైన పంట బంగాళాదుంప.




## దారి కనుక్కోండి



## బేతాళ ప్రశ్న-22

భాస్కర్ ఒక ఇంటర్వ్యూకి వెళ్లాడు. గది లోపలికి వెళ్లగానే ఇంటర్వ్యూ చేసే అధికారి అటెండర్‌ను పిలిచి కాఫీ తీసుకురమ్మని చెప్పాడు. అటెండర్ కాఫీ తీసుకొచ్చి భాస్కర్ ముందు పెట్టాడు. ఆ అధికారి భాస్కర్‌ను "వాట్ ఈజ్ ఇన్ ఫ్రంట్ ఆఫ్ యు" అని ప్రశ్నించాడు. దానికి భాస్కర్ వెంటనే "టీ" అని సమాధానం చెప్పాడు. అధికారి భాస్కర్‌ను మెచ్చుకుని ఉద్యోగం ఇచ్చాడు. ఎందుకు?

**సమాధానం వచ్చేవారం**

**మీ దగ్గర ఇలాంటి మెదడుకు మేతవేసే ప్రశ్నలు, భేతాళ ప్రశ్నలు ఉంటే జవాబుతో పాటు మా ఈమెయిల్ kerintha.aj@gmail.com కు పంపించగలరు**

**గతవారం సమాధానం:** టీచర్ ముందుగా 3 యాపిల్స్‌ను తీసుకుని ప్రతి పండును 4 ముక్కలుగా కోసి ఒక్కో విద్యార్థికి మూడేసి ముక్కలు చొప్పున నలుగురికి పంచింది. మిగిలిన ఒక్క యాపిల్‌ను ఫ్రిజ్‌లో పెట్టింది.



**బేతాళ ప్రశ్న- 20కి సరైన సమాధానం చెప్పిన మొదటి ముగ్గురు:** కే.శ్రీవెంకటేశ్వర స్వామి, బాలాపూర్, ఎస్. సాయిశ్రీకాంత్, అనంతపురం, ఎ. సురేష్, నకిరేకల్



# ఎక్స్‌ట్రా కాఫీ

అదో కాఫీషాపు. జేమ్స్ తొలిసారి స్నేహితులతో కలిసి లోపలికి అడుగు పెడుతుంటే "అయిదు కాఫీలు. రెండు మాకివ్వండి. మిగిలిన మూడు పక్కన పెట్టండి" అనడం వినిపించింది. అతడు అయిదు కాఫీలకు డబ్బు చెల్లించి, తన స్నేహితుడితో కలిసి కాఫీ తాగి వెళ్లిపోయాడు.

తర్వాత మరో పడుచు జంట వచ్చింది. వాళ్లు నాలుగు కాఫీలకు ఆర్డరిచ్చి రెండు కాఫీలు పక్కన పెట్టించారు. ఇదంతా జేమ్స్‌కి కొత్తగా అనిపించింది. అదే విషయం స్నేహితులను అడిగితే "కొన్ని నిమిషాలు ఓపిక పట్టు... నీకే తెలుస్తుంది" అని మరింత ఆసక్తి రేకెత్తించారు. ఆ తర్వాత మరో వ్యక్తి వచ్చి అయిదు కాఫీలకు ఆర్డరిచ్చి, ఒకటి నాకు, మిగిలినవి పక్కన పెట్టండి అన్నాడు. ఈ 'కాఫీ పక్కనబెట్టడం' అంటే ఏమిటో తెలుసుకోవాలని ఓపిగ్గా ఎదురు చూడసాగాడు జేమ్స్. కాఫీ షాపుకు కస్టమర్లు వస్తూనే ఉన్నారు. కొంతమంది అదనపు కాఫీలకు డబ్బులు చెల్లిస్తూనే ఉన్నారు.

బయట మంచు కురవడం ప్రారంభమైంది. ఆ సమయంలో చలికి వణుకుతూ చివికిపోయిన బట్టలతో ఒక వృద్ధుడు ఆ కాఫీషాపులోకి అడుగు పెట్టాడు. అతడు నేరుగా కౌంటర్ దగ్గరకు వెళ్లి "ఈ రోజు మీ దగ్గర పక్కనబెట్టిన కాఫీలు ఏమైనా ఉన్నాయా?" అని అడిగాడు. దానికి కౌంటర్ వెనకాల ఉన్న అమ్మాయి "ఉన్నాయి... ఒక నిమిషం ఉండండి" అని సర్వర్‌ని పిలిచి కాఫీ తెమ్మని చెప్పింది. ముసలాయన సర్వర్ తెచ్చిన వేడి వేడి కాఫీ తీసుకుని ఓ మూలకు వెళ్లి కూర్చున్నాడు. అప్పుడు జేమ్స్‌కి అర్థమైంది 'కాఫీ పక్కనబెట్టడం' మాటలోని అర్థం. ఇంత మంచి సంప్రదాయాన్ని కొనసాగిస్తోన్న కాఫీషాపును, అక్కడివచ్చే కస్టమర్లను మనసులోనే అభినందించాడతను. అప్పుడే 'ప్రార్థించే పెదవులు కన్నా సాయం చేసే చేతులు మిన్న' అనే లోహపు అక్షరాలు గోడ మీద తళతళ మెరుస్తూ కనిపించాయి.

ఈ సంప్రదాయం తొలిసారి ఇటలీ దేశ ప్రముఖ పట్టణాల్లో ఒకటైన నేపుల్స్‌లో ప్రారంభమైంది. ఆ తర్వాత ప్రపంచమంతా విస్తరించింది. కస్టమర్లు అదనంగా కొన్న కాఫీలు... అవి కొనుక్కోలేని వారికి ఉపయోగపడతాయి. కొన్ని చోట్ల కాఫీల్లాగే భోజనాలను అదనంగా కొని అన్నార్తులకు వదిలి వెళుతున్నారు. ■

# ఫైర్ కటింగ్

ఎవరైనా కటింగ్ చేయమంటే దువ్వెన, కత్తెర ఉపయోగిస్తారు. అలా చేస్తే తనకేం గుర్తింపు ఉంటుందనుకున్నాడో బార్బర్. అందుకే లైటర్‌తో జుట్టు అంటించి ఫైర్ కటింగ్ మొదలుపెట్టాడు. అతడి పద్ధతి ఎలా ఉంటుందంటే

ముందుగా కస్టమర్‌కి ఎలాంటి హెయిర్ స్టైల్ బావుంటుందో నిర్ణయించుకుంటాడు. ఆ తర్వాత కస్టమర్ నెత్తిపై పౌడర్ చల్లుతాడు. ధారగా నూనె పోస్తాడు. పౌడర్, నూనె రెండూ మండే స్వభావం కలిగినవే! ఆ తర్వాత లైటర్ వెలిగించి తలపై మంట పెడతాడు. అప్పుడే అతడి చేతులు రెండు దువ్వెనలతో చకచకా కదులుతాయి. తలపై ఎక్కడ వెంట్రుకలు కాలి రాలిపోవాలో ఆ దిశగా మంటను ఎడ్జస్ట్ చేస్తాడు. మంట ఆరిపోయేదాకా వేగంగా తల దువ్వుతాడు. ఆ తర్వాత మళ్లీ జుట్టుపై మరింత ఎక్కువ పౌడర్ కుమ్మరించి, ఆయిల్ వేసి మంటను సృష్టిస్తాడు. అనుకున్న రీతిలో హెయిర్ స్టైల్ కుదరగానే మంట ఆర్పి జుట్టు దువ్వుతాడు. పాకిస్తానీ వివాదాస్పద జర్నలిస్టు ఒమర్ ఖురేషి ఇదంతా వీడియో తీసి ట్విట్టర్‌లో పోస్టు చేస్తే అది వైరల్ అయింది. ఒళ్లు గుగుర్పాటుకు లోనయ్యే ఈ ఫైర్ కటింగ్ మరీ కొత్తదేం కాదు. 2006లో నీలేష్ బాబూలాల్ పరేఖ్ అనే బార్బర్ కళ్లకు గంతలు కట్టుకుని మరీ గ్యాస్‌లైటర్‌తో 4 గంటల 40 నిమిషాల్లో 76మంది పురుషులు, స్త్రీలు, పిల్లలకు ఇలా హెయిర్ కట్ చేసి 'లిమ్కా బుక్ ఆఫ్ రికార్డ్స్'లోకి ఎక్కాడు.



ఈ 'ఫైర్ కటింగ్' ఎక్కువగా ఉపయోగ పడేది మహిళలకే! వారి కురుల చివర్ల చిట్లిపోయినట్లవుతుంది కదా! సాధారణ హెయిర్ కటింగ్‌తో ఆ సమస్య మళ్లీ మళ్లీ వస్తుంది. కానీ ఫైర్ కటింగ్‌తో ఆ సమస్యను సమర్థంగా ఎదుర్కో వచ్చట. మన దేశంలోనే కాదు బ్రెజిల్, అమెరికా, ఇటలీ వంటి దేశాల్లోనూ ఈ ఫైర్‌కటింగ్ చాన్నాళ్ల నుంచి ప్రాచుర్యంలో ఉంది. ■

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో

## థైరాయిడ్ సమస్యలకు సరైన పరిష్కారం



డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

సరైన ఆహార నియమాలు మరియు వ్యాయామాలు పాటించినప్పటికీ బరువు పెరగడం, జుట్టు విపరీతంగా రాలిపోవడం, చర్మం పొడిబారినట్లుగా ఉండటం, అధిక మానసిక కల్లోలానికి గురికావటం మరియు స్త్రీలు - ఋతుచక్ర సమస్యలను ఎదుర్కొంటున్నట్లయితే వాటిని నిర్లక్ష్యం చేయకూడదు. ఈ తరహా ఇబ్బందులు థైరాయిడ్ సమస్యల వలన కలిగి ఉండవచ్చు. ఈ మధ్యకాలంలో చాలా ఎక్కువ మంది ఈ థైరాయిడ్ సమస్యల బారిన పడటం జరుగుతోంది. థైరాయిడ్ గ్రంథి ద్వారా ఉత్పత్తి కాబడే థైరాయిడ్ హార్మోన్‌ల ప్రభావం శరీర కణాలన్నింటిపై ఉంటుంది. ఏ స్వల్ప కారణం చేతనైనా ఈ హార్మోన్‌ల స్థాయిలు అసమతుల్యతలకు గురి అయినట్లయితే - అలాంటి పరిస్థితి తీవ్రమైన అనారోగ్యానికి దారితీసే ప్రమాదం ఉంటుంది. కాబట్టి ఈ వ్యాధి పట్ల అవగాహన పెంచుకుని, దీనిని సత్వరమే గుర్తించి, సరైన చికిత్స గనక పొందినట్లయితే దీన్నుండి పూర్తిగా బయట పడటమే కాకుండా, అది కలుగజేసే దుష్ప్రభావాల నుండి కూడా మనల్ని మనం కాపాడుకునే అవకాశం ఉంటుంది. అయితే ఇతర వైద్య విధానాలలో థైరాయిడ్ సమస్యలకు కేవలం హార్మోన్ సప్లిమెంట్ అందించటమే తప్ప పూర్తి చికిత్స అందుబాటులో లేదు. కేవలం హోమియో చికిత్స ద్వారా మాత్రమే ఈ వ్యాధులను పూర్తిగా నయం చేయవచ్చు.




మానవ శరీరంలోని అతి ముఖ్యమైన గ్రంథులలో థైరాయిడ్ గ్రంథి ఒకటి. ఇది మెడ ముందు భాగంలోని కంఠం దగ్గర సీతాకోకచిలుక ఆకారంలో శ్వాసనాళానికి ఇరుప్రక్కలా ఉంటుంది. సహజంగా మన శరీరంలోని హైపోథలామస్ ద్వారా విడుదలయ్యే TRH (థైరోట్రాపిన్ రిలీజింగ్ హార్మోన్) హార్మోన్ సంకేతంతో - పిట్యుటరీ గ్రంథి శరీరంలోని థైరాయిడ్ హార్మోన్ స్థాయిలను గుర్తించి, TSH (థైరాయిడ్ స్టిమ్యులేటింగ్ హార్మోన్) హార్మోన్‌ను విడుదల చేస్తుంది. ఈ హార్మోన్ థైరాయిడ్ గ్రంథిని ఉత్తేజపరచటం ద్వారా, అది T3, T4 హార్మోన్‌లను ఉత్పత్తి చేసి, రక్తప్రవాహంలోకి పంపుతుంది. ఇలా రక్తంలో కలిసిన హార్మోన్‌లు శరీర కణాలన్నింటికీ చేరుకుని, అన్ని జీవక్రియలైన - గుండె, నాడీమండలం, జీర్ణవ్యవస్థ, మానసిక మరియు శారీరక ఎదుగుదల, బేసల్ మెటబాలిక్ రేట్ మరియు సంతానోత్పత్తి వ్యవస్థ వంటి వాటిపై ప్రభావం చూపుతాయి. ఇలా నిరంతరం శరీరంలో థైరాయిడ్ హార్మోన్‌లను తగిన స్థాయిలో ఉంచే హైపోథలామస్, పిట్యుటరీ, థైరాయిడ్ హార్మోన్‌ల వ్యవస్థ విఫలమైనప్పుడు, హార్మోన్‌ల అసమతుల్యత ఏర్పడి, అవి ఎక్కువగా లేదా తక్కువగా ఉత్పత్తి కావడం ఒక ఇబ్బందికరమైన సమస్యగా పరిణమించి, హైపర్‌థైరాయిడిజం లేదా హైపోథైరాయిడిజం మరియు గాయిటర్ వంటి దీర్ఘకాలిక ఆరోగ్య సమస్యలకు దారి తీస్తుంది.

**(1) హైపోథైరాయిడిజం:** శరీరంలోని థైరాయిడ్ హార్మోన్‌లు తక్కువ మోతాదులో ఉత్పత్తి కావడాన్ని హైపోథైరాయిడిజం అంటారు. ఇది సాధారణంగా ఎక్కువ మందిలో కనిపిస్తుంది. ఏ వయస్సు వారిలోనైనా ఈ సమస్య ఏర్పడవచ్చు. ముఖ్యంగా చిన్నపిల్లలలో మరియు స్త్రీలలో ఇది ఎక్కువగా కనిపిస్తుంది. **లక్షణాలు: చిన్నపిల్లలలో** - బుద్ధిమాంద్యం, ఎదుగుదల లోపం, జ్ఞాపకశక్తి లేకపోవడం, మలబద్ధకం, చురుకుదనం లేకపోవడం, వయస్సుకు మించి లావుగా ఉండటం మొ॥వి. **యుక్తవయస్సు వారిలో:** బరువు పెరగడం, BMR తగ్గిపోవడం, రజస్వల ఆలస్యం కావడం, ఋతుచక్ర సమస్యలు-నెలసరి రాకపోవడం, నెలసరిలో అధిక లేదా అల్ప రక్తస్రావం కావడం, సంతానలేమి, చర్మం పొడిబారడం, చలికి తట్టుకోలేకపోవడం, బద్ధకంగా ఉండటం, త్వరగా అలసిపోవడం, నిద్ర సరిగా పట్టకపోవడం, ఏకాగ్రత లోపించడం, కీళ్ళు-కండరాలు నొప్పులకు గురి కావటం వంటి లక్షణాలను గమనించవచ్చు.

**(2) హైపర్‌థైరాయిడిజం:** థైరాయిడ్ హార్మోన్‌లు శరీరంలో ఎక్కువ మోతాదులో ఉత్పత్తి కావడాన్ని హైపర్‌థైరాయిడిజం అంటారు. **లక్షణాలు:** ఆహారం సరైన మోతాదులో తీసుకున్నప్పటికీ బరువు తగ్గిపోవటం, నెలసరి త్వరగా రావడం, ఋతుచక్రములో అధిక రక్తస్రావం కావడం, సంతానలేమి సమస్యలు, చెమటలు ఎక్కువగా పట్టడం, చేతులు వణకడం, వేడిని తట్టుకోలేకపోవడం, గుండెదడ, విరేచనాలు, జుట్టు రాలిపోవటం, అర్టికేరియా వంటి చర్మసమస్యలు ఏర్పడటం వంటి లక్షణాలను గమనించవచ్చు.

**(3) గాయిటర్:** థైరాయిడ్ గ్రంథి వాపునకు గురి కావడాన్ని 'గాయిటర్' అంటారు. కొన్ని సందర్భాలలో థైరాయిడ్ గ్రంథి - సహజ పరిమాణం కంటే రెండింతలు పెరిగి, స్వరపేటికపైన ఒత్తిడిని కలిగించటం వలన స్వరంలో మార్పు వస్తుంది. గాయిటర్‌లో థైరాయిడ్ హార్మోన్‌లు (T3, T4) సాధారణ స్థాయిలో ఉన్నప్పటికీ గాయిటర్ వ్యాధి లేనట్లుగా నిర్ధారించలేము. **కారణాలు:** ఈ గాయిటర్ వ్యాధికి అతి ముఖ్యమైన కారణం 'అయోడిన్' అనే మూలకం యొక్క లోపం ఏర్పడటం. **లక్షణాలు:** గొంతు క్రింద అసహజ వాపు ఏర్పడటం వలన ఆహారం మ్రింగడానికి కష్టంగా ఉంటుంది. స్వరంలో మార్పులు రావటం, కనుగుడ్లు బయటకు పొడుచుకు వచ్చినట్లుగా ఉండటం వంటి లక్షణాలను గమనించవచ్చు.

**థైరాయిడ్ సమస్యలకు గల కారణాలు:** నేటి మానవుని జీవన విధానం ప్రకృతి విరుద్ధంగా ఉండటం, అధిక మానసిక ఒత్తిడికి గురి కావటం, శారీరక శ్రమ తక్కువగా ఉండటం, వ్యాయామం లేకపోవడం, పౌష్టికాహార లోపం, అయోడిన్ లోపం, థైరాయిడ్ గ్రంథిని కొద్దిగా తొలగించడం మరియు పిట్యుటరీ గ్రంథిలో వచ్చే వ్యాధుల వలన మరియు వంశపారంపర్యత వంటి అంశాల కారణంగా ఈ థైరాయిడ్ సమస్యలు ఉత్పన్నమవుతాయి.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** థైరాయిడ్ ప్రొఫైల్ - T3, T4, TSH, యాంటీ థైరాయిడ్ యాంటీ బాడీస్, USG ఆఫ్ థైరాయిడ్ గ్లాండ్, గొంతు యొక్క CT స్కాన్ వంటి పరీక్షల ద్వారా థైరాయిడ్ వ్యాధిని నిర్ధారించవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో మాత్రమే అందించబడే జెనెటిక్ కాన్స్టిట్యూషనల్ చికిత్సా విధానం ద్వారా థైరాయిడ్ సమస్యలను సంపూర్ణంగా నయం చేయవచ్చు. రోగి యొక్క మానసిక మరియు శారీరక లక్షణాలపై సమగ్ర అధ్యయనం జరిపిన తదుపరి, ఆ వ్యక్తికి సరిపడిన ఔషధాన్ని అందించడం ద్వారా ఇది సాధ్యపడుతుంది. అంతేకాకుండా జీవితకాలం మందులు వాడే అవసరం లేకుండా, మళ్ళీ వ్యాధి తిరగబెట్టని విధంగా ఈ వ్యాధి నయం చేయబడుతుంది.




## వేర్వేరు సమయాలు..?



డాక్టర్లు మనకు మందులు ఇస్తూ కొన్ని భోజన సమయానికి ముందు, మరికొన్ని భోజనం చేసిన తర్వాత వేసుకోమని చెప్తారు. ఎందుకంటే మనం తీసుకున్న ఔషధాలు మన శరీరంలో కలవడంలో ఆహారం పాత్ర కీలకమైనది. మందులు రక్తంలోకి ప్రవేశించి కావాల్సిన ప్రదేశానికి చేరుకోవడానికి వేర్వేరు ప్రక్రియలుంటాయి. కొన్ని మందులను తీసుకున్న తర్వాత అవి కడుపులో యాసిడ్లను ఉత్పత్తి చేస్తాయి. దానివల్ల కడుపులో మంట, నొప్పి ఏర్పడటం, వాంతులు కావడం వంటి సమస్యలు తలెత్తుతాయి. అందుకే ఇలాంటి మందులను భోజనం తర్వాత తీసుకుంటే వాటి ప్రభావం తక్కువగా ఉంటుంది. అవి ఆహారంతో పాటు జీర్ణమై రక్తంలో కలిసిపోతాయి. అలా కాకుండా వెంటనే రక్తంలో కలిసిపోవాల్సిన అవసరం ఉన్నపుడూ, కడుపుపై ఎలాంటి నెగెటివ్ ప్రభావం ఉండవనుకున్నప్పుడూ వాటిని భోజనానికి ముందే వేసుకోమని చెప్తారు. అలాగే కొన్ని మందులు పాలు, టీ, కాఫీలతో తీసుకోవద్దని చెప్తారు. ఎందుకంటే ఆ ద్రవాలలోని రసాయన మిశ్రమాలకు, మందులలోని రసాయనాలకు చర్య జరిగి దుష్ఫలితాలు కలిగే అవకాశముంటుంది.

## ఫ్యానుకు మూడు రెక్కలే...?



ఫ్యాను చేసే ముఖ్యమైన పని తక్కువ శబ్దంతో గది నలుమూలలకూ గాలి వచ్చేలా చేయడం. అయితే ఫ్యాన్‌కు ఎక్కువగా మూడే రెక్కలు ఉండటం మీరు గమనించే ఉంటారు. దానికి కారణం ఫ్యాన్ రెక్కల బరువు దానిలోని ఎలక్ట్రిక్ మోటారుకు బ్యాలెన్స్ అయ్యే విధంగా ఉంటేనే ఫ్యాను పూర్తి సామర్థ్యంతో పని చేస్తుంది. దాని కోసమే ఒక్కోదాని మధ్యా 120 డిగ్రీల కోణం ఉండేలా మూడు రెక్కలను ఉంచడం పరిపాటి. రెండు రెక్కలను అమర్చాలనుకుంటే వాటిని ఒకదానికొకటి వ్యతిరేక దిశల్లో ఉండేలా అమర్చుతారు. కళాత్మకంగా ఉండాలని కొన్నిసార్లు నాలుగు రెక్కలు కూడా పెడతారు కాని అలాంటివి చాలా తక్కువే. ఎగ్జాస్ట్ ఫ్యానుల పని లోపలి వేడి గాలిని బయటకు పంపడం కాబట్టి వాటికి మాత్రం ఎక్కువ రెక్కలు... అంటే 5 నుంచి 6 రెక్కలుంటాయి.

## మిక్చర్ పొట్లం

బొమ్మలు : వెంకట్

### మౌనేశ్వర్రావు

"రోజూ మీరెంత సేపు మౌనం పాటిస్తారు?"
"రెండు నిమిషాలు."
"మిగతా సమయం ఏం చేస్తుంటారు?"
"మౌనం ప్రాశస్త్యం గురించి ఉపన్యాసం ఇస్తుంటాను".

### ప్రశాంతత విలువ



"పెళ్లి రోజున సుబ్బారావు తన భార్యకు డైమండ్ నెక్లెస్ బహుమతిగా ఇచ్చాడు తెలుసా .."
"ఆమె వాడ్ని చాలా మెచ్చుకుని ఉంటుందే .."
"ఆవిడ ఆ తర్వాత ఆరు నెలలపాటు సుబ్బారావుతో మాట్లాడలేదు"
"బహుశా అది డూప్లికేట్ సరుకని తెలిసిందేమో."
"అదేం కాదు .. ఆ ఒప్పందం పైనే సుబ్బారావు డైమండ్ నెక్లెస్ కొన్నాడట!"

### జబ్బుంటేనే ఉద్యోగం

ఒక కార్పొరేట్ కంపెనీలో హెల్త్ క్యాంపు నిర్వహించారు. ఇద్దరి ఆరోగ్యం మాత్రం ఫర్‌ఫెక్ట్‌గా ఉంది. మిగతా వాళ్లందరికీ బి.పి, కొలెస్ట్రాల్ వగైరా జబ్బులు ఉన్నాయి.
మర్రోజు మేనేజ్‌మెంట్ ఆ ఇద్దరి ఉద్యోగాలు పీకేసింది.
ఆ జబ్బులేమీ లేవంటే వాళ్లు సరిగ్గా పని చేయడం లేదని.

### అసలంటూ ఉంటే కదా!



"అల్లావుద్దీన్ అద్భుత దీపం దొరికింది నాకు" భార్య.
"వావ్ ... ఏం కోరుకున్నావు?" భర్త.
"మీకు ఇప్పుడున్న తెలివిని పది రెట్లు పెంచమని కోరాను" భార్య.
"ఓహ్ .. నేనంటే నీకెంత ప్రేమో .. మరి పెంచాడా?" భర్త.
"లేదు. జీరోని ఎన్నిసార్లు హెచ్చించినా లాభం లేదన్నాడు" భార్య.

### వాడే రాంగ్ రూట్‌లో వచ్చాడు

ఒక పావురం స్పీడుగా వెళ్తున్న కారుకి ఢీ కొట్టి మూర్ఛపోయింది. రెండు గంటల తర్వాత స్పృహ వచ్చి చూస్తే తనొక పంజరంలో ఉన్నట్టు గ్రహించింది.
అప్పుడది ఇలా అనుకుంది.
"కొంపదీసి డ్రైవర్ చచ్చాడా .. నన్ను తీసుకొచ్చి జైల్లో పెట్టారు?"

## మార్గం ఉంది నాయనా



“స్వామీ .. నాలోని లోపాలు తెలుసుకునే మార్గం చెబుతారా?” అడిగాడు భక్తుడు.

“పిచ్చివాడా .. దానికి ఇంత దూరం నన్ను వెతుక్కుంటూ రావాలా? నీ భార్యతో ‘ఈ మధ్య నువ్వు కాస్త లావెక్కావు’ అను చాలు. ఈ జన్మలోని లోపాలతో పాటు నీ గత జన్మలోని లోపాలు కూడా వినగలవు” బోధించాడు స్వామీజీ.

## రివర్సయింది

“డాక్టర్ ... మా ఆయన నిద్రలో నడుస్తున్నాడని చెపితే అది పోవడానికి మందిచ్చారు కదా..”

“యా .. మందు బాగా పనిచేసిందా? మానేశారా?”

“నడవడం మానేసి పరిగెట్టడం మొదలుపెట్టారు డాక్టర్!”

## తెలివి తెల్లారింది

“క్లియరెన్స్ సేల్ బోర్డ్ పెట్టినా కస్టమర్లు రావట్లేదయ్యా ..” వాపోయాడు వరహాలరావు.

“అయ్యో .. ఇంతకీ మీరు చేస్తున్న బిజినెస్ ఏంటి?” అడిగాడు కోదండం.

“హోటల్ బిజినెస్” చెప్పాడు వరహాలరావు.

## ఛాయా‘చిత్రం’



**“ఫోటో తర్వాత తీద్దువులే .. ముందు దుప్పి ఎక్కడైనా ఉందేమో చూడు. ఆకలిగా ఉంది.”**

# చుంబనాల చెమ్మ

ఈ వారం కవిత



బొమ్మ : **అక్బర్**

**ము**ద్దులాట ఆడుకుందామా
ఎవరు గెలుస్తారో చూద్దామా
సన్నజాజుల పలువరస మాటున చిరునవ్వుతో తను

ఆమె లేలేత అరచేతిలో
శత చుంబనాలు అద్దాను మోహంగా మోహనంగా
స్థితిలయలో .. శృతి లయలో ...
ఏమో ... ఏ రాగ రంజితమో ...

ఆమె సగమే తిరిగియిచ్చి అలసిపోయింది మగత కళ్లతో ...
‘మిగతావో’ అన్నాను చిరునవ్వుతో
ఆ తృప్తి మెరుపు ముఖాన్ని చూస్తూ
తళుకులీనే ఆ అరచేతిని వేలి కొసలతో నిమురుతూ ...

పద్దు రాసుకో అరచేతిలో
వడ్డీతో యిస్తానులే ఏదో ఒకనాటికి
బాధ సలుపుతుండాలి ...
నేను మళ్లీ మళ్లీ గుర్తు రావాలి అన్నది తను
అరమూతల కన్నులతో పెదవులతో పసిపాప దరహాసంతో ...

నన్నిక్కడే విడిచి
కాలం సుదూరంగా వెళ్లిపోయింది ...

ఎన్ని అభ్యంతరాలో ఎన్నెన్ని బంధనాలో ...
తను మళ్లీ రాలేదు ... రానూలేదు ...

నా అరచేతిలో
చుంబనాల చెమ్మె తను
యిప్పటికీ .. అప్పటిలా ... తాజాగా ...
పురుటి వాసన జ్ఞాపకంలా ...

(ఆ లేలేత అరచేతులకి)

**- జుగాష్ విలి, 98482 66384**

# అనుగ్రహం

19-25 ఫిబ్రవరి 2017

డాక్టర్ పి.ఎ.రామన్



**మేషం : అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం**

సంప్రదింపులు ఫలిస్తాయి. శుభకార్యం నిశ్చయమవుతుంది. కొత్త యత్నాలకు శ్రీకారం చుడతారు. పరిచయాలు, బంధుత్వాలు బలపడతాయి. ఆది, సోమ వారాల్లో ధనవ్యయం విపరీతం. ఒక అవసరానికి ఉంచిన ధనం మరోదానికి వ్యయం చేస్తారు. పనులు వేగవంతమవుతాయి. ముఖ్యమైన వ్యక్తులను కలుసుకుంటారు. దంపతుల మధ్యసఖ్యత లోపం, చికాకులు తలెత్తుతాయి. పంతాలు, భేషజాలకు పోవద్దు. నీలకంఠునికి విభూది, పండ్ల రసాలతో అభిషేకం శుభదాయకం.



**వృషభం : కృత్తిక 2,3,4; రోహిణి, మృగశిర 1,2 పాదాలు**

ఊహలు, అంచనాలు ఫలిస్తాయి. ఆర్థిక లావాదేవీలతో హడావుడిగా ఉంటారు. ధనమూలక సమస్యలు కొలిక్కి వస్తాయి. చెల్లింపులు, నగదు స్వీకరణలో జాగ్రత్త. మీ ఆధిక్యతను ప్రదర్శించవద్దు. మంగళ, బుధ వారాల్లో లౌక్యంగా పనులు చక్కబెట్టుకోవాలి. ఆత్మీయుల రాక ఆశ్చర్యం కలిగిస్తుంది. ఆరోగ్యం నిలకడగా ఉంటుంది. పదవులు, బాధ్యతలు స్వీకరిస్తారు. స్తోమతకు మించి హామీలివ్వవద్దు. సంకల్పసిద్ధికి ఈశ్వరునికి తేనె, గంధంతో అభిషేకం చేయించండి.



**మిథునం : మృగశిర 3,4; ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు**

వేడుకలను ఆర్భాటంగా చేస్తారు. మీ ఉన్నతిని చూసి కొందరు అపోహపడతారు. పనులు అస్తవ్యస్తంగా సాగుతాయి. ఆది, గురు వారాల్లో కావలసిన వ్యక్తుల కలయిక సాధ్యం కాదు. ఆత్మీయులకు ముఖ్య సమాచారం అందిస్తారు. పెద్దల ఆరోగ్యం కుదుటపడుతుంది. సన్నిహితులకిచ్చిన మాట నిలబెట్టుకుంటారు. మీ సిఫార్సుతో ఒకరికి సదవకాశం లభిస్తుంది. శివునికి మారేడుదళాలు, చామంతులతో అర్చన కలిసొస్తుంది.



**కర్కాటకం : పునర్వసు 4వ పాదం, పుష్యమి, ఆశ్లేష**

ఆశయ సాధనకు ఓర్పు ప్రధానం. పట్టుదలతో యత్నాలు సాగించండి. మీ తప్పిదాలకు ఇతరులను నిందించవద్దు. చేతిలో ధనం నిలబడదు. రుణదాతల ఒత్తిడి ఆందోళన కలిగిస్తుంది. ఆపత్సమయంలో సన్నిహితులు చేయూత నిస్తారు. మీ శ్రీమతి వైఖరిలో మార్పు వస్తుంది. అనేక పనులతో సతమతవుతారు. ఒక ఆహ్వానం ఆశ్చర్యం కలిగిస్తుంది. కార్యసాధనకు ఏకరుద్రాభిషేకం, మారేడు దళార్చన అనుకూలం.



**సింహం : మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం**

ఆర్థికంగా ఫర్వాలేదనిపిస్తుంది. సకాలంలో చెల్లింపులు జరుపుతారు. రోజువారీ ఖర్చులే ఉంటాయి. సంప్రదింపులు, వ్యవహార ఒప్పందాలకు అనుకూలం. ప్రణాళికాబద్ధంగా పనులు పూర్తి చేస్తారు. గురు, శుక్ర వారాల్లో అపరిచితులకు బ్యాంకు వివరాలు వెల్లడించవద్దు. విలువైన వస్తువులు, పత్రాలు జాగ్రత్త. శుభకార్యాల్లో విలువైన కానుకలు చదివించుకుంటారు. మీ రాక బంధుమిత్రులకు సంతోషాన్నిస్తుంది. మానసిక ప్రశాంతతకు పరమేశ్వరుని పంచామృతాలతో అభిషేకం శ్రేయస్కరం.



**కన్య : ఉత్తర 2,3,4; హస్త, చిత్త 1,2 పాదాలు**

నూతన పెట్టుబడుల విషయంలో పునరాలోచన మంచిది, ఎవరినీ అతిగా విశ్వసించవద్దు. నమ్మకస్తులే మోసగించేందుకు యత్నిస్తారు. సలహా కంటె సొంత నిర్ణయమే శ్రేయస్కరం. ఖర్చులు విపరీతం. పొదుపు మూలక ధనం ముందుగానే గ్రహిస్తారు. పనులు మందకొడిగా సాగుతాయి. శనివారం నాడు ఏ విషయంపై ఆసక్తి ఉండదు. ఆత్మీయుల ఆహ్వానం ఆలోచింపచేస్తుంది. సంతానం కదలికలను గమనించండి. పాలు, నారికేళ జలంతో ఈశ్వరునికి అభిషేకం శుభం, జయం.



**తుల : చిత్త 3,4; స్వాతి, విశాఖ 1,2,3 పాదాలు**

ఈ వారం ఆదాయ వ్యయాలకు పొంతన ఉండదు. కొత్త విషయాలు గ్రహిస్తారు. పనులు నిదానంగా పూర్తవుతాయి. బంధుమిత్రులను కలుసుకుంటారు. సంప్రదింపులకు అనుకూలం. స్థిమితంగా ఆలోచించి నిర్ణయం తీసుకోవాలి. సలహాలు అడుగవద్దు. స్వయంకృషితో అనుకున్నది సాధిస్తారు. బ్యాంకు వివరాలు గోప్యంగా ఉంచండి. కొంతమంది మోసగించే ఆస్కారం ఉంది. సంతానం చదవుల పట్ల శ్రద్ధ అవసరం. బోళా శంకరునికి గంధం, పూలతో అర్చన శుభదాయకం.



**వృశ్చికం : విశాఖ 4వ పాదం; అనూరాధ, జ్యేష్ఠ**

శుభకార్యాల్లో అందరినీ ఆకట్టుకుంటారు. బంధుమిత్రుల కలయిక సంతోషాన్నిస్తుంది. ఆత్మీయులకు కానుకలు అందిస్తారు. ఖర్చులు పెరిగినా ఇబ్బంది ఉండదు. పనుల ప్రారంభంలో అవాంతరాలెదురు్కంటారు. మీపై శకునాల ప్రభావం అధికం. దంపతుల మధ్య అవగాహన నెలకొంటుంది. సముచిత నిర్ణయాలు తీసుకుంటారు. గృహ నిర్మాణాలు వేగవంతమవుతాయి. విలువైన వస్తువులు, నగదు చేజారిపోయే ఆస్కారం ఉంది. శివునికి పండ్లరసాలతో అభిషేకం కలిసిరాగలదు.



**ధనుస్సు : మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పాదం**

రాబోయే ఆదాయానికి తగ్గట్టుగా ఖర్చులుంటాయి. యత్నాలు మందకొడిగా సాగుతాయి. ప్రముఖుల కలయిక వల్ల ఏమంత ప్రయోజనం ఉండదు. ఆది, సోమ వారాల్లో చీటికి మాటికి అసహనం ప్రదర్శిస్తారు. ఆప్తుల కలయికతో కుదుటపడతారు. ఒక ఆహ్వానం సందిగ్ధానికి గురి చేస్తుంది. శ్రమాధిక్యతతో పనులు పూర్తి చేస్తారు. అవివాహితులు కొత్త అనుభూతికి లోనవుతారు. గంధం, మారేడు దళాలతో అర్చన శుభదాయకం.



**మకరం : ఉత్తరాషాఢ 2,3,4; శ్రవణం, ధనిష్ఠ 1,2 పాదాలు**

ఆర్థిక లావాదేవీలు, వ్యవహారాలతో తీరిక ఉండదు. ఒక సమాచారం ఉపశమనం కలిగిస్తుంది. బాకీలు, ఇతరత్రా రావలసిన ధనం నిదానంగా అందుతుంది. వేడుకలు, శుభకార్యాలకు హాజరవుతారు. పనులు అస్తవ్యస్తంగా సాగుతాయి. సోదరీ సోదరులతో సంప్రదింపులు జరుపుతారు. మంగళ, బుధవారాల్లో మీ ప్రతిపాదనలకు అభ్యంతరాలెదురవుతాయి. కార్యసాధనకు పంచామృతాలతో పరమేశ్వరునికి అభిషేకం అనుకూలం.



**కుంభం : ధనిష్ఠ 3,4; శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు**

కార్యసాధనకు ఓర్పు ప్రధానం. అందివచ్చిన అవకాశాన్ని తక్షణం వినియోగించుకోండి. ఖర్చులు సామాన్యం. కొంత మొత్తం ధనం అందుతుంది. పరిచయస్తులు ధనసహాయం అర్థిస్తారు. పెద్ద మొత్తం సాయం శ్రేయస్కరం కాదు. గురు, శుక్ర వారాల్లో ఒకేసారి అనేక పనులతో సతమతమవుతారు. మీ ఆధిపత్యం అన్ని చోట్ల పనిచేయదు. పోగొట్టుకున్న పత్రాలు తిరిగి పొందుతారు. పెద్దల ఆరోగ్యం స్థిరంగా ఉంటుంది. చామం తులు, మారేడు దళాలతో శివారాధన కలిసిరాగలదు.



**మీనం : పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర, రేవతి**

విమర్శలు, అభియోగాలు ఎదుర్కొంటారు. మీ గౌరవానికి భంగం కలుగకుండా మెలగండి. ఆదాయ వ్యయాలకు పొంతన ఉండదు. పనులు మందకొడిగా సాగుతాయి. వ్యవహారాల్లో ఏకాగ్రత వహించండి. శనివారం నాడు మొహమ్మాటాలు, భేషజాలకు పోవద్దు. స్థిమితంగా ఆలోచించండి. ఆరోగ్యం స్థిరంగా ఉంటుంది. పరిచయాలు, బంధుత్వాలు బలపడతాయి. నిరుద్యోగుల కృషి ఫలిస్తుంది. కీలక సమావేశాల్లో పాల్గొంటారు. పండ్లరసాలు, పంచామృతాలతో శివునికి అభిషేకం శుభదాయకం.

## అవునా!



ప్రపంచంలో మొదటి సోలార్ పవర్డ్ బైక్ లైన్ కలిగిన దేశం నెదర్లాండ్స్.

- 2014లో సోనీ సంస్థ 185 టెరాబైట్ల సామర్థ్యం కలిగిన ఒక క్యాసెట్ టేప్‌ని తయారు చేసింది.

- రొయ్యలన్నీ పుట్టినపుడు మగవే. ఎదిగేకొద్దీ వాటిలో కొన్ని ఆడ రొయ్యల్లా మారతాయి.



వేలిగోర్లు చలికాలంలో వేగంగా పెరుగుతాయి.

- అత్యంత ఖరీదైన సుగంధ ద్రవ్యం - కుంకుమ పువ్వు.

- ఎర్రమంట కన్నా నీలిమంటలో వేడి ఎక్కువ.

- నవ్వినపుడు, ఏడ్చినపుడు, ఉల్లిపాయలు తరిగినప్పుడు వచ్చే మూడు రకాల కన్నీళ్లూ మైక్రోస్కోప్‌లో వేర్వేరుగా కనిపిస్తాయి.



ప్రపంచం మొత్తం మీద నేపాల్ జాతీయ జెండా ఒక్కటి మాత్రమే దీర్ఘచతురస్రాకారంలో ఉండదు.

- ఇదివరకు నీటిలో తేలడానికి వీలుగా లైఫ్‌జాకెట్లలో ప్రొద్దుతిరుగుడు పువ్వు గింజల్ని నింపేవారు.

- వాటర్ బాటిల్‌పై ఉండే ఎక్స్‌పైరీ డేట్ బాటిల్‌కి సంబంధించినది... నీళ్లది కాదు.

# అదృష్ట రత్నజ్యోతి


## రమేశ్చంద్ర మహర్షి

సెల్ : **92465 82255,** ఫోన్ : **040-6522 5554**


**కె.ఎ.ఆర్., హైద్రాబాద్**

**మా అబ్బాయి జన్మకుండలి నిర్మొహమాటంగా వివరించగలరు.**

ఈ జన్మకుండలి ప్రకారం-

1. నక్షత్రం పునర్వసు. మిధున రాశి.

2. ఇతని తండ్రి గుడ్డుకు సంబంధించిన... అంటే పౌల్ట్రీ బిజినెస్ చేయడం జరుగుతుంది... చంద్రుని వలన.

3. ఇతడు మొదటి సంతానం... చంద్రుని స్థితి వలన... అలాగే బృహస్పతి వీక్షణ వలన.

4. ఇతనికి ఒక చెల్లెలుంటుంది... శని రాహువుల స్థితి వలన.

5. భద్ర మహాపురుష యోగం వలన సామాజికంగా ఒక ఉన్నత స్థాయికి చేరుకోవడం, శుక్ర బుధుల వలన తండ్రికి ఉన్నత స్థితి, తాను తండ్రిని మించిన తనయునిగా మంచి పేరు తెచ్చుకోవడం జరుగుతుంది.

6. రవి కేతువుల కలయిక వలన, అధిపతికి కేతువు కంట్రోలింగ్ ఫేక్టర్ కావడం వంటి కారణాల వలన ఆరోగ్యం విషయంలో ఎప్పటికప్పుడు జాగ్రత్తలు పాటిస్తూ ఉండాలి. అలాగే ఆ కోణంలో పరిహారాలు పాటించాలి.

7. వృత్తి స్థానంలో లాభాధిపతీ, పితృ స్థానాధిపతుల స్థితి వంటి కారణంగా తండ్రికి చెందిన వ్యాపారాల్లో ఇతనికి సంబంధం కలుగుతుంది. దానిలో ప్రత్యక్ష సంబంధం, విజయం తన 30 వయసు నుండి ప్రారంభమవుతుంది.

8. తన 11 నుండి 30 మధ్య నడిచే శని దశ పి.జికి విదేశాలకు పంపిస్తుంది.

9. ఇక కళత్ర భావానికి వెళ్తే, అధిపతికి లాభాధిపతి కంట్రోలింగ్ ఫేక్టర్ కావడం, ఒకరి నక్షత్ర మండలంలో మరొకరు పరివర్తన చెందడం వంటి కారణాల వలన గొప్పింటి అమ్మాయితో వివాహం అంగరంగ వైభవంగా ప్రారంభమవుతుంది. అయితే 95 శాతం కుజదోషం పొంచి వున్న పాములా ఎదురుచూస్తుంటుంది. కనుక వివాహం, పీటల మీద కూడా ఆగిపోయే పరిస్థితి ఎదురు కాకుండా పరిహారాలు పాటించాలి. అయితే దానితోనే ఇక్కడ కుజదోషం పోయినట్టు కాదు. కళ్యాణం జరిగేది 28వ ఏట. అయితే 29లో కుజదోషం పూర్తి స్థాయిలో పురులు విప్పుకుంటుంది. ఇది దాటే విషయంలో పరిహారాలు పాటించాల్సి ఉంటుంది. ఈ జాతకుని కుజదోషానికీ, ఆయుష్షుకీ లంకె ఏర్పడిన కారణంగా 29, 30లలో అది అగ్ని పరీక్షే! అయితే లగ్నాధిపతి బలం, భద్ర మహాయోగం, బృహస్పతి వలన పరిహారాలు పాటించి బయటపడడం జరుగుతుంది... పునర్జన్మ!!!

10. 30 నుండి 47 మధ్య నడిచే బుధ దశ అతిశయించి యోగిస్తుంది. పూర్తి స్థాయి వ్యాపారం! ధనం, పరపతి సుఖం, చర స్థిరాస్తులు... ఏది వేలు పెట్టి చూపిస్తే అది తనది అన్నట్టుగా నడిచే దశ!

11. దీనిలో... ఈ వ్యాపారంలో అత్యంత జాగ్రత్తగా ఉండవలసినది 38, 39 వయసులో. పైన శని దశలో కుజదోషం రూపంలో వ్యక్తమయిన కుజభుక్తి ఇప్పుడు వ్యాపారంలో ఆటంకాలు, ఊహించని నష్టాల రూపంలో తనను తాను వ్యక్తం చేసుకుంటుంది.

12. 47 నుండి 54 వయసు మధ్య నడిచే కేతు దశలో అనారోగ్యం కొంచెం గట్టిగానే బాధిస్తుంది. ఆ కారణంగా "ఆర్తా దేవాన్ నమస్యంతి"... భక్తి పెరుగుతుంది. చూడని పుణ్యక్షేత్రముండదు.

13. 54 నుండి 74 మధ్య నడిచే శుక్ర దశ తిరిగి మంచి ఆరోగ్యాన్నిస్తుంది. వృత్తిలో గత వైభవం! సింహం మళ్ళీ జూలు విదిలించినట్టు... వీరుడు తిరిగి ఖడ్గం దూసినట్టు...

14. 74 నుండి 80 మధ్య రవి దశ. మేధావులకూ, ప్రతిభావంతులకూ అనారోగ్యం, ఆయుష్షులతోనే కదా శతృత్వం...

తన 78లో...



ఈ వారం కథ

పాలపర్తి జ్యోతిష్మతి

**పరుగులాంటి నడకతో వస్తున్న వెంకన్నని చూసి సావిత్రి 'లోపలి కొచ్చేస్తాడేమో' అని భయపడి గబగబా ముందుకెళ్ళింది. గేటు ఇవతల్నించే "ఏంటి వెంకన్నా, ఆ కంగారు? ఏమైంది?" అని అడిగింది ఆదుర్దాగా.**

**"పెద్దయ్యగారు గుళ్ళో పడిపోయారమ్మా" ఆయాసపడుతూ చెప్పాడు వెంకన్న అవతల్నించే.**



బొమ్మలు : **చారి పి.యస్.**

# పితృకార్యం

**ఆ** మాట వినడంతోటే సావిత్రికి గుండె దడదడలాడి ఒళ్ళంతా నీరసం ఆవహించింది. అంత కంగారులోనూ "నువ్వు గుళ్ళోకెట్లా వెళ్ళావు?" అని అడగడం మాత్రం మర్చిపోలేదు.

"నేను గుళ్ళోకెల్ల లేదమ్మా. దారెంట ఎల్తుంటే చిన్నయ్యగారు చప్పట్లుకొట్టి పిల్సి 'నాన్నగారు కళ్ళు తిరిగి పడిపోయారు. ఇంటికి తీసుకెల్లడానికి బండేదేనా సూడు' అన్నారమ్మా. నేను ఎదురొచ్చిన ఆటోని గుడికాడికి పంపి, ఇసయం మీకు సెప్పాలని పరిగెత్తుకొచ్చానమ్మా" అన్నాడు వెంకన్న.

"పక్క సిద్ధం చేస్తాను" అంటూ ఇంట్లోకెళ్ళింది సావిత్రి.

రామశాస్త్రిగారు ఆ ఊరి గుడి పూజారి. ఆయన కొడుకు శంకరశాస్త్రి బి.ఎ. దాకా చదివినా, ఉద్యోగం వచ్చే లోపల ఖాళీగా ఉండడం ఎందుకని తండ్రితోబాటు గుడికి వెళ్ళడం మొదలుపెట్టి, ఉద్యోగం సంపాదించుకోలేక చివరికి అర్చకత్వంలోనే స్థిరపడిపోయాడు. తన స్థోమతకి ఎక్కువే అయినా ఒక్కగానొక్క కొడుకు రాజేష్‌ని మాత్రం పట్నంలో బి.టెక్. చదివిస్తున్నాడు.

రామశాస్త్రిగారు వయసు పైబడ్డాక గుడి బాధ్యత పూర్తిగా కొడుక్కి అప్పజెప్పేశారు. అయినా రోజూ ఏదో ఒక సమయంలో గుడికెళ్ళి దర్శనం చేసుకోందే ఆయనకు తోచదు. మరీ నీరసంగా ఉందని పది రోజులుగా గుడికి వెళ్ళని రామశాస్త్రిగారు ఆ రోజే సెలవలకి ఇంటికొచ్చిన మనవణ్ణి తోడు తీసుకుని గుడికి వెళ్ళారు. వాళ్ళటు వెళ్ళిన కాసేపటికే రామశాస్త్రిగారు గుళ్ళో పడిపోయారన్న వార్త మోసుకొచ్చాడు వెంకన్న.

రామశాస్త్రిగారి ఇంటిపక్కనున్న ఖాళీ స్థలంలో అతను చిన్న పాక వేసుకుని కాపురముంటున్నాడు. అతను, అతని తండ్రి, భార్య, కొడుకు పొలాల్లో కూలి పనికి వెళ్తుంటారు. చదువు సంధ్యల్లేవని, ఆచారాలు, పద్ధతులు పాటించరని వాళ్ళంటే సావిత్రికి చులకన భావం. వెంకన్న కొడుకు శీను రాజేష్‌తో బాటు ఎనిమిదో తరగతి దాకా చదివి పనిలోకెళ్ళక తప్పని పరిస్థితుల్లో చదువు మానేశాడు. అవకాశమున్నప్పుడల్లా రాజేష్‌నడిగి అనేక విషయాలు తెలుసుకుని ప్రపంచజ్ఞానం పెంచుకుంటూ ఉంటాడు.

నాలుగు రోజుల క్రితం వెంకన్న తండ్రి చనిపోయాడు. అదీ సావిత్రి వెంకన్నని గేటు దాటి లోపలికి రానివ్వక పోవడానికి కారణం.

సావిత్రి రామశాస్త్రిగారింటికి కోడలిగా వచ్చేటప్పటికే రామశాస్త్రిగారి భార్య పరలోకగతులయ్యారు. రామశాస్త్రిగారి కూతురు పెళ్ళయి కాపరానికి వెళ్ళిపోయింది. ఆడదిక్కులేక అస్తవ్యస్తంగా ఉన్న ఇంటిని ఒక రూపానికి తీసుకొచ్చి సావిత్రి మామగారి ప్రేమకు పాత్రురాలయింది. సావిత్రికి మామగారి మాట వేదవాక్కు. రామశాస్త్రిగారికి సావిత్రి కూతురికంటే ఎక్కువ. రామశాస్త్రిగారి మడి, ఆచారం, చాదస్తం మొత్తం పుణికిపుచ్చుకుంది సావిత్రి.

'మామగారు గుళ్ళో పడిపోయారంటే పరిస్థితి ఏమిటో? ఇంటికి తెచ్చాక మంచం మీద పడుకోబెట్టొచ్చా? కింద పడుకోబెట్టాలా?' అనుమానం వచ్చింది సావిత్రికి. అటువంటి ఆలోచన వచ్చినందుకు టపటపా చెంపలు వాయించుకుని మామగారి మంచం సర్దిన సావిత్రి మళ్ళీ ఎందుకైనా మంచిదని చాప కూడా సిద్ధంగా ఉంచింది. ఇంటి ముందు ఆటో ఆగిన చప్పుడవడంతో బయటికి పరుగెత్తింది.

రాజేష్ తాతయ్యని ఆటోలోంచి లేపి భుజం మీద వేసుకుని ఇంట్లోకి తీసుకొచ్చాడు. మామగారి స్థితి చూడగానే సావిత్రి నేలమీద చాప పరిచింది. రాజేష్ తాతయ్యని జాగ్రత్తగా దింపి చాపమీద పడుకోబెట్టాడు.

శంకరశాస్త్రి వస్తూవస్తూ ఊళ్ళో ఉన్న ఆరెంపీ డాక్టర్ని వెంటబెట్టుకొచ్చాడు. అతను రామశాస్త్రిగారి చెయ్యి పట్టుకుని నాడి చూసి పెదవి విరిచేసి వెళ్ళిపోయాడు. సావిత్రి

కుప్పకూలిపోయింది.

బంధువులంతా చుట్టుపక్కల ఊళ్ళలోనే ఉండడం, అందరూ వెంటనే బయల్దేరి రావడంతో అంత్యక్రియలు చకచకా జరిగిపోయాయి. సాయంత్రానికల్లా ఎక్కడివాళ్ళక్కడికి వెళ్ళిపోవడం కూడా అయిపోయింది. శంకరశాస్త్రి అక్క, బావ ఆ మాట ఈ మాట మాట్లాడుతూ ఇంకాసేపు కూర్చుని లేచి నిలబడ్డారు.

"అదేంటి వదినా! నువ్వు కూడా వెళ్ళిపోతావా? మామయ్యగారు లేరనే నిజాన్నే నేను జీర్ణించుకోలేకపోతున్నాను. దిగులుతో బుర్ర పనిచెయ్యట్లేదు. నేనొక్కదాన్నే అన్ని పనులూ చక్కబెట్టుకోలేను. ఈ పన్నెండు రోజులూ కార్యక్రమాలు పూర్తి అయ్యేదాకా ఉండరాదూ?" లక్ష్మిని బ్రతిమాలింది సావిత్రి.

"అన్నాళ్ళు ఉండిపోవడానికి నాకెక్కడ కుదురుతుందమ్మా! పిల్లను నేడో రేపో పురిటికి తీసుకురావాలి. ఇంక ఇప్పుడు ఈ కార్యక్రమాలు అయ్యాకే అనుకో తెచ్చేది. కానీ మిగతా ఏర్పాట్లన్నీ చూసుకోవాలి గదా! పదోరోజు తెల్లవారుఝామునే బయలుదేరి వచ్చేస్తాలే" మరో మాటకు అవకాశం ఇవ్వకుండా వెళ్ళిపోయింది లక్ష్మి.

వారం రోజులు భారంగా గడిచిపోయాయి. "అపరకర్మలకి ఏర్పాట్లు మొదలుపెట్టాలి" శంకరశాస్త్రికి గుర్తు చేసింది సావిత్రి.

"అదే ఆలోచిస్తున్నాను. శవదహనం అయ్యేటప్పటికే బోలెడు ఖర్చు అయింది. అక్కయ్య ఇది చెయ్యాలి, అది చెయ్యాలి అంటూ కొండంత భారం నా నెత్తిన పెట్టి వెళ్ళింది. అంత డబ్బు ఎక్కణ్ణించి తేవాలి?" దిగులుగా అన్నాడు శంకరశాస్త్రి.

"డబ్బు కోసం చూసుకుని అపరకర్మలు మానుకుంటామా?" తీవ్రంగా అంది సావిత్రి.

"ఆలోచిస్తున్నానన్నానుగా" విసుగ్గా అన్నాడు శంకరశాస్త్రి.

"ఎక్కువ ఖర్చు లేకుండా పొదుపుగా చేసుకోవచ్చుగా నాన్నా" అన్నాడు అక్కడే ఉన్న రాజేష్.

అవునన్నట్టు తలూపాడు శంకరశాస్త్రి.

"మామయ్య ఆత్మ క్షోభించకూడదు, అన్నీ పద్ధతిగా జరగాలి" పట్టుదలగా అంది సావిత్రి.

"ఆ రోజు తాతయ్యని ఆటోలో ఇంటికి తెచ్చేటప్పుడు 'నాకు అవసాన సమయం సమీపించింది. వైద్యం చేయించి బ్రతికించాలని ప్రయత్నించొద్దు. నా అపరకర్మలు గయలో జరిపించాలనేది నా చివరి కోరికగా మీ అమ్మానాన్నలకు చెప్పు' అన్నారు తాతయ్య నాతో. ఇప్పుడు మనం గయ చేరుకునే ఏర్పాట్లు చేసుకోవాలి" అన్నాడు రాజేష్.

"ఆ రోజు అత్తయ్య అన్ని మాటలు మాట్లాడుతుంటే ఈ మాట చెప్పలేదెందుకురా? ఇప్పుడు చెప్తే ఏమంటుందో! అయినా ఇప్పటికిప్పుడు వెళ్ళడం ఎట్లా కుదురుతుంది?" భయంగా అంది సావిత్రి.

"తత్కాల్‌లో టికెట్లు బుక్ చేసుకుని రేపు రైలెక్కుదాం. ముందే చెపితే ఏవేవో అనుమానాలు అడుగుతుంటారని మీకు ఇప్పటిదాకా చెప్పలేదు నేను" అన్నాడు రాజేష్.

"అత్తయ్య, మామయ్య కూడా మనతో వస్తారేమో కనుక్కుందాం" అన్నాడు శంకరశాస్త్రి.

"ఇక్కడ పది రోజులు ఉండడానికే కుదరదంది అత్తయ్య. అంత దూరం ఏం వస్తుంది. మీరేం మాట్లాడకండి. అత్తయ్యకి తరువాత నేను చెప్తాను. మన ముగ్గురికి రిజర్వేషన్లు చేసుకొస్తాను" అంటూ వెళ్ళిపోయాడు రాజేష్.

**మర్నాడు స్టేషనుకి బయలుదేరుతున్న శంకరశాస్త్రి దగ్గరికి వచ్చి "మా నాయన దినం, పెద్దయ్యగారి దినం ఒకేరోజు పడ్డాయి. మా వాల్లందర్నీ మేం పిలుసుకుని, మీ వాల్లందర్నీ మీరు పిల్సుకుంటే మీకూ మాకూ ఇబ్బందే. మాకా దినం నాడు యాట కొయ్యక తప్పదు. మీరా అది బరించలేరు. మేం మానుకోలేం. మీరు సద్దుకోలేరు. ఎవరికీ బాద లేకుండా మీరు కాశీ ఎల్లి అయ్యగారి దినం గనంగా జరుపుకోవడం చానా మంచిదయింది. మాకంత అదురుస్టం లేదు. ఏదో మాకు చాతనయినంతలో గనంగానే సేత్తాం" అన్నాడు వెంకన్న.**

"వారం రోజులుగా ఆ శీనుగాడితో మంతనాలాడుతున్నాడు వీడు. వాళ్ళని కూడా బయలుదేరదీస్తాడేమో" అక్కసుగా అంది సావిత్రి.

శంకరశాస్త్రి ఏమీ మాట్లాడలేదు.

"చదువూ సంధ్యా, మడీ ఆచారం లేనివాళ్ళు. వాళ్ళేం వస్తారు" తేలిగ్గా తీసిపారేస్తూ మళ్ళీ తనే అంది సావిత్రి.

మర్నాడు స్టేషనుకి బయలుదేరుతున్న శంకరశాస్త్రి దగ్గరికి వచ్చి "మా నాయన దినం, పెద్దయ్యగారి దినం ఒకేరోజు పడ్డాయి. మా వాల్లందర్నీ మేం పిలుసుకుని, మీ వాల్లందర్నీ మీరు పిల్సుకుంటే మీకూ మాకూ ఇబ్బందే. మాకా దినం నాడు యాట కొయ్యక తప్పదు. మీరా అది బరించలేరు. మేం మానుకోలేం. మీరు సద్దుకోలేరు. ఎవరికీ బాద లేకుండా మీరు కాశీ ఎల్లి అయ్యగారి దినం గనంగా జరుపుకోవడం చానా మంచిదయింది. మాకంత అదురుస్టం లేదు. ఏదో మాకు చాతనయినంతలో గనంగానే సేత్తాం" అన్నాడు వెంకన్న.

"వెంకన్న చెప్పినదాన్ని బట్టి ఈ ప్రయాణం మన మంచికే అనిపించటం లేదా?" స్టేషన్లో అస్థిమితంగా కూర్చుని ఉన్న తల్లిదండ్రుల్ని అడిగాడు రాజేష్.

"వాళ్ళ వాళ్ళ పద్ధతులు వదులుకోరుగానీ మనం మాత్రం ఎక్కడికో పారిపోయి అయినవాళ్ళలో పలచన కావాలా?" ఉక్రోషంగా అంది సావిత్రి.

శంకరశాస్త్రి ఎటూ తేల్చుకోలేని అయోమయంలో ఉన్నాడు.

రైలు వస్తోందన్న ప్రకటన రావటంతో ఆ సంభాషణకి తెరపడింది.

రైలెక్కగానే "ఇది కాశీ వెళ్ళే రైలేనా?" అనుమానంగా అడిగాడు శంకరశాస్త్రి.

"కాదు, మనం తాతయ్య అపరకర్మలు చెయ్యడానికి ఉత్తరాది గయకు వెళ్ళట్లేదు. పిఠాపురంలోని పాదగయ దగ్గర చేసేద్దాం" అన్నాడు రాజేష్.

"అదేంటి?" ఆశ్చర్యంగా అడిగాడు శంకరశాస్త్రి.

"ఏంట్రా, పెత్తనమంతా నీ చేతుల్లోకి తీసుకుని ఇష్టారాజ్యంగా చేస్తున్నావు?" కోపంగా అడిగింది సావిత్రి.

"రైల్లో వాదన వద్దమ్మా. అక్కడికి వెళ్ళాక వివరంగా చెప్తానుగా! కాస్త ఓపిక పట్టు" అనునయంగా తల్లి చేతులు పట్టుకుని అన్నాడు రాజేష్.

చేతులు విదిలించుకుని ముడుచుకుని కూర్చుంది సావిత్రి.

శంకరశాస్త్రికి అంతా అయోమయంగా ఉంది. 'పితృకార్యం సక్రమంగా జరపకపోతే ఏం దుష్పరిణామాలు వస్తాయో' అని కంగారు పడుతున్నాడు. ఇంకోవైపు 'పాదగయలో జరిపినా గయలో జరిపిన ఫలితం దక్కుతుంది, తప్పులేదు' అని సర్ది చెప్పుకుంటున్నాడు.

'బంధువులెవరూ, కనీసం అక్క కూడా రాకుండా చెయ్యడం మంచిదేనా?' అని ప్రశ్నించుకుంటున్నాడు. 'అక్క చెప్పినట్టల్లా చేస్తే ఆ ఖర్చుకు తట్టుకోవడం సాధ్యమేనా?' అని భయపడుతున్నాడు. 'అప్పులపాలవకుండా తక్కువ ఖర్చుతో చెయ్యగలుగుతున్నందుకు' ఉపశమనం పొందుతున్నాడు. 'ఎవరికీ చెప్పకుండా దూరంగా ఎక్కడో చేసేసి ఇంటికి వెళ్తే ఎవరేమనుకుంటారో' అని సంకోచపడుతున్నాడు. 'అసలు చేశావా? ఎక్కడో చేసొచ్చానని బుకాయిస్తున్నావా?' అని అక్క అనుమానిస్తుందేమోనని ఆందోళన పడుతున్నాడు. తన

మనోభావాలన్నీ భార్యతో పంచుకోవాలని ఆరాటపడుతున్నాడు. కాని సావిత్రి ముఖం చూసి మాట్లాడే ధైర్యం చెయ్యలేక పోతున్నాడు.

గమ్యం చేరేదాకా సావిత్రి, శంకరశాస్త్రి ముళ్ళమీద కూర్చున్నట్టు కూర్చున్నారు. రైలు దిగి సత్రానికి వెళ్ళగానే సావిత్రి రాజేష్ మీద విరుచుకుపడింది. "అసలు తాతయ్య నీతో ఆ మాటలు నిజంగా చెప్పారా? లేక నువ్వే కల్లబొల్లి మాటలు చెప్పి మమ్మల్నిట్లా లాక్కొచ్చావా?" అంది.

రాజేష్ వాళ్ళమ్మకు సమాధానం చెప్పకుండా అత్తయ్యకి ఫోన్ చేసి "రేపు నువ్వు మనూరు రానక్కర్లేదు. మేము తాతయ్య అపరకర్మలు గయలో చెయ్యాలని కాశీ వచ్చాం. నువ్వు వదిన్ని పురిటికి తీసుకురావాలి, ఏవో ఏర్పాట్లు చూసుకోవాలి అన్నావు కదా! ఎట్లాగూ నువ్వు రావులే అని ముందు చెప్పలేదు" అని చెప్పి మరో మాటకి అవకాశం ఇవ్వకుండా పెట్టేశాడు.

"అత్తయ్య అంటూనే ఉంది తాతయ్య ప్రాణాలు గుళ్ళోనే పోయి ఉంటాయి అని. నాక్కూడా అదే అనుమానంగా ఉంది. పుణ్యాత్ముడు... దేవుడి సన్నిధిలో ప్రాణాలొదిలారు. నువ్వేమో ఉత్తరక్రియలు కూడా సక్రమంగా జరపనీయకుండా ఇక్కడికి తెచ్చిపడేశావు" మనసు కష్టపెట్టుకుంటూ అంది సావిత్రి.

"మీరనుకున్నదే నిజమైతే గుళ్ళో ప్రాణాలు వదిలినందుకు తాతయ్యకి పుణ్యగతులు రావచ్చు. కానీ గుడి అపవిత్రమైపోయింది, సంప్రోక్షణ చెయ్యాలనరా మీరందరూ? అప్పుడెంత ఖర్చవుతుంది? ఆ ఖర్చంతా మనమే భరించాలిగా! అది మనవల్ల అయ్యే పనేనా? ప్రాణం లేని తాతయ్యని ఏ ఆటోవాడైనా తన ఆటోలో ఎక్కించుకుంటాడా? అప్పుడు తాతయ్యని గుడి నుంచి ఇంటికి తీసుకురావడానికి ఎంత ఇబ్బందయ్యేదో ఊహించగలవా?" నాన్‌స్టాప్‌గా చెప్పుకుపోతున్న రాజేష్ వైపు సంభ్రమంగా చూశాడు శంకరశాస్త్రి. సావిత్రి మాత్రం ధుమధుమ లాడుతూనే ఉంది.



"కనీసం ఉత్తర క్రియలైనా..." అంటున్న సావిత్రి మాట పూర్తి కాకుండానే రాజేష్ "సక్రమంగా జరగవని ఎందుకనుకుంటున్నావు? పితృకార్యాలు జరుపుకోవడానికి శ్రేష్ఠమైనదిగా పేరుపొందిన ప్రదేశమేగా ఇది! ఇక్కడ అన్నీ శాస్త్రోక్తంగానే జరుపుతారు గదా!" తల్లిని చల్లబరచడానికి ప్రయత్నిస్తూ అన్నాడు.

"అత్తయ్య చెప్పింది గదరా దానాలూ అవీ పద్ధతిగా ఇవ్వాలని, ఆ దానాలు తీసుకోవడానికి తనే ఎవరినో తీసుకొస్తానని" గునుస్తూ అంది సావిత్రి.

> **"అమ్మా! అత్తయ్య చెప్పినట్టుగా గోవుని, బంగారాన్ని దానం చెయ్యగల స్తోమత ఉందా మనకి? వచ్చిన బంధువులందరికీ ఖరీదైన గిఫ్టులు ఇవ్వాలి అంది అత్తయ్య. అసలు గిఫ్టులివ్వడమేంటో నాకర్థం కాలేదు మొదట. ఫలానావారి జ్ఞాపకార్థం అని రాసి ఏవో వస్తువులు ఇస్తుంటారు ఇటువంటి సందర్భాల్లో. అవి కాబోలు అత్తయ్య ఉద్దేశంలో గిఫ్టులంటే అని తరువాత అనుకున్నాను. ఎవరింట్లో చూసినా ఏం చేసుకోవాలో అర్థం కాకుండా పడి ఉండే స్టీలు గ్లాసులో, పళ్ళాలో, గిన్నెలో, డబ్బాలో కనిపిస్తాయి. మనం ఇంకోటి ఇవ్వడం వల్ల వాళ్ళకు ఒరిగేదేంటి, మనకు బోలెడు ఖర్చు తప్ప. తాతయ్య జ్ఞాపకార్థం ఏమైనా జరగాలనుకుంటే ఏదో ఒక సత్రంలో పేదలకి అన్నదానం నిమిత్తం ఎంతో కొంత ఇద్దాం. మన ఆర్థిక పరిస్థితికి అనుగుణంగా ఖర్చు పెట్టుకుందాం"**

"అమ్మా! అత్తయ్య చెప్పినట్టుగా గోవుని, బంగారాన్ని దానం చెయ్యగల స్తోమత ఉందా మనకి? వచ్చిన బంధువులందరికీ ఖరీదైన గిఫ్టులు ఇవ్వాలి అంది అత్తయ్య. అసలు గిఫ్టులివ్వడమేంటో నాకర్థం కాలేదు మొదట. ఫలానావారి జ్ఞాపకార్థం అని రాసి ఏవో వస్తువులు ఇస్తుంటారు ఇటువంటి సందర్భాల్లో. అవి కాబోలు అత్తయ్య ఉద్దేశంలో గిఫ్టులంటే అని తరువాత అనుకున్నాను. ఎవరింట్లో చూసినా ఏం చేసుకోవాలో అర్థం కాకుండా పడి ఉండే స్టీలు గ్లాసులో, పళ్ళాలో, గిన్నెలో, డబ్బాలో కనిపిస్తాయి. మనం ఇంకోటి ఇవ్వడం వల్ల వాళ్ళకు ఒరిగేదేంటి, మనకు బోలెడు ఖర్చు తప్ప. తాతయ్య జ్ఞాపకార్థం ఏమైనా జరగాలనుకుంటే ఏదో ఒక సత్రంలో పేదలకి అన్నదానం నిమిత్తం ఎంతో కొంత ఇద్దాం. మన ఆర్థిక పరిస్థితికి అనుగుణంగా ఖర్చు పెట్టుకుందాం" చెప్పడం ఆపాడు రాజేష్.

'చదువూ సంధ్యా, మడీ ఆచారం లేని వెంకన్నే నయం... పితృకార్యం తృప్తిగా ఘనంగా జరుపుకుంటున్నాడు' అని గొణుక్కుంటూనే ఉంది సావిత్రి ఆ మూడు రోజులూ.

కార్యక్రమాలు ముగించుకుని ఇల్లు చేరగానే "ఏం వెంకన్నా బాగా జరిగిందా మీ నాన్న దినం" ఆరాగా అడిగింది సావిత్రి.

"చినబాబుగారు మావాడికి 'అనవసరంగా మొయ్యలేనంత కర్సెందుకు పెట్టుకుంటార్రా? పోయినోల్లేమన్నా సూడొచ్చారా? తినొచ్చారా?' అంటూ ఇతబోద సేశారంట. ఆడు నా బుర్ర తినేసి 'ఠాట్! ఆడంబరాలకి పోడానికి ఈల్లేదు' అని ఆడ్డగేసేశాడు. ఎవర్నీ పిలవకుండా మట్టసంగా పంతులుగారికి మోయనిచ్చేసి మా నాయనకో దణ్ణం పెట్టేసి ఊరుకున్నాం" అని సమాధానం చెప్పాడు వెంకన్న.

ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవి చేసుకుని చూసింది సావిత్రి వెంకన్నని.

"అబ్బాయిగారు సెప్పిందీ నిజమే కదా! ఎందుకొచ్చిన అట్టహాసాలు, అప్పులు అని నాక్కూడా అనిపించిందమ్మా. సరే అట్టానే కానిమ్మని అట్టానే ఎల్లబుచ్చేశా" అనేసి వెళ్ళిపోయాడు వెంకన్న.

"చదువూ సంధ్యా లేనివాళ్ళే పరిస్థితులని బట్టి తొందరగా మారారు" అన్నాడు రాజేష్.

"మనమూ మారాంగా... ఇష్టంగానో, అయిష్టంగానో" సాధింపుగా అంది సావిత్రి.

"దూరానికెక్కడికో పారిపోయి, ఎక్కడికెళ్ళామో ఎవరికీ తెలీకుండా..." అసంతృప్తిగా అన్నాడు శంకరశాస్త్రి.

రచయిత్రి మొబైల్ : 97011 15600

# మోకాళ్లనొప్పులుంటే బతుకు గోతిలో పడ్డట్టే


డాక్టర్ టి. ఎల్. శ్రీనివాసరావు

**సహజ ఆయుర్వేదిక్ హాస్పిటల్ అండ్ రీసెర్చ్ సెంటర్**

హైదరాబాద్: మలక్‌పేట్ ,విజయనగర్‌కాలనీ

బ్రాంచీలు : హన్మకొండ, రాజమండ్రి విజయవాడ అనంతపూర్, జోగిపేట్, తిరుపతి, నెల్లూరు

ఫోన్స్ : 9160994455, 9160994456




**అసలే** ఇది స్పీడ్ యుగం. ఈ కాలంలో ఎవరైనా కుంటుతూ, గెంటుతూ ఎలా మనగలుగుతారు? అవును... మోకాళ్లనొప్పుల గురించే మనం మాట్లాడుకుంటున్నాం. అయినా కీళ్లు కదల్లేని ఆ పరిస్థితి వచ్చేదాకా మనం ఎందుకు నిర్లక్ష్యంగా ఉండిపోయినట్లు? వాస్తవానికి శరీరం కీళ్లలోలోపల జరుగుతున్న నష్టం గురించి కొన్ని హెచ్చరికల ద్వారా అంటే నొప్పి ద్వారా ఎప్పటికప్పుడు తెలియచేస్తూనే ఉంటుంది మనమే ఏమీ పట్టనట్లు ఉండిపోతాం. కీళ్లనొప్పులు ఎవరికీ హఠాత్తుగా వచ్చిపడవు. దశల వారీగా అవి తీవ్రమవుతూ వస్తాయి. ఇంతకీ మోకాళ్ల నొప్పులు తలెత్తడానికి ముందు శరీరంలో ఏం జరుగుతుంది?

- మొదట కార్టిలేజ్‌లో సాగే గుణం తగ్గిపోతుంది. ఆ తర్వాత క్రమంగా కీళ్లల్లో అరుగుదల మొదలవుతుంది. ఈ ప్రభావం దాని అడుగున ఉండే మోకాలి ఎముక మీద పడుతుంది. ఆ తర్వాత ఎముక మందమై కార్టిలేజ్ వెనక బుడిపెలు ఏర్పడతాయి.
- ఎముక చివర ఆస్టియోఫైట్స్ అనే మొనలుఏర్పడి ఆ ప్రభావం కీలు మీద పడుతుంది,. దీనివల్ల కార్టిలేజ్ మరింత దెబ్బతిని కీళ్లల్లో వాపును పెంచే సైటోకైన్స్ అనే ప్రొటీన్లు కీళ్లను మరింత నాశనం చేస్తాయి. ఈ దశలో కొన్ని రకాల హానికారక ఎంజైములు వృద్ధి చెంది సైనోవియం పొరలో వాపు ఏర్పడుతుంది.
- ఎముకలోనూ, కార్టిలేజ్‌లోనూ వచ్చిన ఈ మార్పుల కారణంగా, ఆ భాగపు కీలు నొప్పి చేయడం, బిగుసుకుపోవడం, కదల్లేని స్థితి ఏర్పడతాయి. ఇంతదాకా వచ్చినా కొందరు డాక్టర్‌ను సంప్రదించే ప్రయత్నం చేయరు. ఈ నిర్లక్ష్యం కొందరికి నరకమే చూపిస్తుంది. ఈ పరిణామాలన్నింటికీ వెనుక సంధివాతం పాత్ర కీలకంగా ఉంటుంది.

## సంధివాతం అంటే...?

శరీరంలోని సమస్త కదలికలకు అవసరమైన వాతం సహజంగానే అందరి శరీరాల్లోనూ ఉంటుంది. అయితే ఈ వాతం ప్రకోపితమైనప్పుడు అంటే సమస్థితిని కోల్పోయినప్పుడు సంధివాతం (ఆస్టియో ఆర్థ్రైటిస్) మొదలవుతుంది. దీన్నే వాతం దూషితం కావడం అంటారు. సహజంగా వాతం కఫాన్ని దూషితం చేసినప్పుడే సంధివాతం మొదలవుతుంది. ఈ సమయంలో దూషిత లక్షణాలు కనిపిస్తాయి. ఈ లక్షణాల్లో ప్రధానంగా కీళ్లు బిగుసుకుపోవడం, కదిలినప్పుడు శబ్దాలు రావడం, ముట్టుకున్నప్పుడు ఆ భాగం వేడిగా అనిపించ డం, ఎరుపుదనం కలిగి ఉండడం, నిలబడే, కూర్చునే వేళల్లో నొప్పి అనిపించడం వంటి లక్షణాలు కనిపిస్తాయి. కొంతమందిలో చాలా సేపు కూర్చున్న తర్వాత గానీ, పడుకుని లేచినప్పుడు గానీ, వెంటనే లేచి నడవలేని పరిస్థితి ఏర్పడుతుంది. అయితే కాసేపు నడిచాక బిగుసుకుపోయిన భాగాలు సడలి, నడకలో కొంత సౌకర్యం ఏర్పడుతుంది. సంధివాతంలో ఇది ఒక ముఖ్య లక్షణంగా ఉంటుంది.

## చల, స్థిర సంధులు

కీళ్లను చల సంధులనీ, స్థిర సంధులనీ రెండు భాగాలుగా విడదీయవచ్చు. కదిలే కీళ్లను చల సంధులనీ, కదలని కీళ్లను స్థిర సంధులనీ అంటారు. ఈ కదిలే చల సంధుల్లోనే కీళ్ల వాతం వస్తుంది. చల సంధుల్లోనే కీళ్ల వాతం రావడానికి శరీర భాగాలన్నింటినీ ఆవరించుకుని, కొన్ని మెంబ్రేన్‌లు అంటే పొరలు దెబ్బతినడమే కారణం. మొత్తంగా అష్టాధర కలలు అంటే ఎనిమిది పొరలు ఉంటాయి. వాటిలో శ్లేష్మధరా కల అనే ఒక పొర ఉంటుంది. దీన్నే సైనోవియల్ సైనోవియల్ మెంబ్రేన్ అంటారు. ఈ సైనోవియల్ ఫ్లూయిడ్ కీళ్లు కదలడానికి తోడ్పడుతూ ఉంటుంది. కదిలే కీళ్లు సహజంగా శ్లేష్మము, సిరలు, కండరాలతో కూడుకుని ఉంటాయి. ఈ శ్లేష్మధరా కల ఎప్పుడైతే, వాత ప్రకోపంతో దూషింపబడుతుందో... అది తన సహజస్థితిని కోల్పోతుంది. దీనివల్ల శరీరంలో ఆమం అంటే వ్యర్థ విష పదార్థాలు ఏర్పడతాయి.ఫలితంగా కొన్ని సమస్యలు తలెత్తుతాయి. అందులో భాగంగా మోకాళ్లనొప్పులు మొదలవుతాయి.

## ఆహార, విహార లోపాలు....

ఆహార విషయాల్లో సరియైన ఆహారం తీసుకోపడం, తీసుకున్న ఆహారం జీర్ణం కాకముందే మళ్లీ తినడం, రూక్ష్మమైన ఆహారం (డ్రై ఫుడ్) తీసుకోపడం వంటి కారణాల వల్ల మనం తీసుకున్న ఆహారం పూర్తిగా జీర్ణం కాకుండా, ఆమం అనే ఒక విషపదార్థం శరీరంలో ఏర్పడుతుంది. సరియైన వేళకు నిద్రించకపోవడం, ఉదయం ఎక్కువ సమయం పడుకునే ఉండడం, రాత్రివేళ ఎక్కువ సమయం మేల్కొని ఉండడం, ఎక్కువ గంటలు కదలకుండా వర్క్‌చేసే వృత్తిలో ఉండడం, ఇటువంటి విహార కారణాల వల్ల మోకాళ్లలోని వాతం దూషించబడుతుంది. ఈ దూషిత వాతమే మోకాళ్ల నొప్పులకు కారణమవుతుంది..

## ఆయుర్వేద చికిత్స

ఏ కారణంగా సంధివాతం అంటే కీళ్ల నొప్పులు మొదలైనా, వాత హర చికిత్సలు చేయడం ద్వారా ఆ సమస్యను తొలగించవచ్చు. అయితే, అరిగిపోయిన కార్టిలేజ్ తిరిగి వృద్ధి చేయడం ద్వారా మాత్రమే ఈ సమస్య శాశ్వతంగా తొలగిపోతుంది. అందుకు గాను ఆయుర్వేదంలో కొన్ని ప్రత్యేకమైన ఔషధ యుక్త తైలాలతో చేసే జానువస్తి చికిత్స ఉంటుంది. దీనివల్ల మోకాళ్లలో అరిగిపోయిన భాగాలన్నీ తిరిగి వృద్ధి చెందుతాయి. తైలాల ద్వారా, కొన్ని రకాల మాత్రల ద్వారా అరిగిపోయిన కార్టిలేజ్‌ను తిరిగి ఉద్ధరించే పూర్తి అవకాశం ఏర్పడుతుంది. వాస్తవానికి కార్టిలేజ్‌ను పునరుద్ధరించే శక్తి ఆయుర్వేద తైలాలకు మాత్రమే ఉంది. జానువస్తి చికిత్సలు ఎవరైనా చేయవచ్చు. కానీ ఆ సమయంలో కీళ్లలోకి పంపించే తైలం పాత్రే ఇక్కడ కీలకం. ఆ తైలం ఎంతో ప్రత్యేకమైనది. ప్రత్యేక తైలాలు, ప్రత్యేకమైన ఔషధాలతో మోకాళ్ల నొప్పులు సమూలంగా తొలగిపోతాయి. ఆయుర్వేద వైద్యుల్ని సూచించిన చికిత్సలన్నీ క్రమం తప్పకుండా తీసుకుంటే, తిరిగి యుక్త వయసులోకి ప్రవేశించినంత ఆనందం, ఉత్సాహం కలుగుతాయి.

## కొత్త పుస్తకాలు

# సృజనాత్మక, ఊహాత్మక కథలు




**1980-90** దశకాల తెలుగు సాహిత్యంలో విభిన్న సాహిత్య సృజన చేసిన అతి కొద్దిమంది రచయితల్లో కె. సదాశివరావు ఒకరు. ఆయన తను రాసిన కథ / కవిత్వ / సైన్స్‌ఫిక్షన్ సాహిత్యాన్ని వరసగా ఆత్మాఫాక్టర్ (సైన్స్‌ఫిక్షన్ కథలు), క్రాస్ రోడ్స్ (కథలు), కావ్యకళ (అనువాద కవితలు) అనే మూడు సంకలనాలుగా వెలువరించారు.

శాస్త్రీయ వాస్తవికత ఆధునిక మానవుడిలో రేకెత్తించిన భవిష్యత్ చింతనను... ఆసక్తిగా చదివించే కథన చాతుర్యంతో 'ఆత్మాఫాక్టర్'లోని పద్నాలుగు కథల్లో బహుముఖంగా ఆవిష్కరించారు రచయిత. అదుపులేని శాస్త్రీయత సృష్టిస్తున్న అభద్రతలకు ఊహను జతచేసి భవిష్యత్ వ్యవస్థలు భవిష్యత్ మానవుణ్ణి అదుపుచేయబోయే విధానాల గురించి అంతర్లీనంగా వివరిస్తారీ కథల్లో. వలస పాలనకూ, దానికి ముందున్న భారతీయ వ్యక్తిత్వానికీ మధ్య జరిగిన సంఘర్షణ ఫలితంగా మధ్య, పై తరగతుల వ్యక్తిత్వాల్లో రూపొందిన సామాజిక వాస్తవికతను 'క్రాస్‌రోడ్స్' కథా సంపుటంలోని పదకొండు కథలు అత్యంత ప్రతిభావంతంగా చిత్రీకరించాయి. తాత్వికత / అంతర్జాతీయత / స్థానికత అంతా కలిసిపోయి ఏర్పడిన ఒక వలస కాలానంతర స్థితిని అర్థం చేయించే కథలివి.




సదాశివరావు కథల్ని సంగీత, సాహిత్య, సాంఘిక శాస్త్రాల ఫ్యూజన్ అని చెప్పవచ్చు. పెరిగిపోయిన 'వ్యాస అంశ' మూలంగా కొన్ని కథల్లో కథాగమనం మందగించినప్పటికీ ఈ తరహా కథా ప్రక్రియ తెలుగు సాహిత్యంలో అరుదైనది. మేరీషెల్లీ నుంచి హారుకీ మూరకామీ వరకు పదిమంది అంతర్జాతీయ సైన్స్‌ఫిక్షన్ రచయితల జీవితాలను, రచనలను అనేక ఆసక్తికర సంఘటనలతో వివరించిన వికీపీడియా తరహా వ్యాసాలు ప్రపంచ సైన్స్‌ఫిక్షన్ రచనా పరిణామక్రమాన్ని విహంగ వీక్షణం చేయిస్తాయి. ఇవి 'ఆత్మాఫాక్టర్' చివర్లో ఉన్నాయి. భవిష్యత్ శాస్త్రీయ వాస్తవికతను అత్యంత సృజనాత్మకంగా, ఊహాత్మకంగా, భ్రమాత్మకంగా దర్శింపజేస్తూ పాఠకుడి ఊహా తృష్ణను సంతృప్తిపరుస్తాయి ఇందులోని కథలన్నీ.






పదిహేను దేశాల తాలూకు 69 అనువాద కవితల సంకలనం 'కావ్యకళ'. ఇందులో స్పానిష్, జర్మన్, ఫ్రెంచ్, ఆఫ్రికన్, హంగేరియన్, క్యూబన్, రష్యన్ తదితర దేశాల కవితలున్నాయి. ప్రపంచ కవిత్వంలోని తాత్వికతనూ, గాఢతనూ మనకు పరిచయం చేస్తాయి ఈ కవితలు. అలాగే మన ఖండానికి అంతగా పరిచయం లేని సైన్స్‌ఫిక్షన్ ఎపిక్ కవితా ప్రక్రియకు సంబంధించిన నాలుగు ఆసక్తికర వ్యాసాలూ చదవదగినవే. ప్రధాన స్రవంతి రచనలకు భిన్నంగా నడిచే సదాశివరావు రచనలు ఒక తరహా పాఠకులను అద్భుతంగా ఆకర్షిస్తాయి.

**- లెనిన్ ధనిశెట్టి**

**ఆత్మాఫాక్టర్, పేజీలు :** 480, **వెల :** రూ.250
**క్రాస్ రోడ్స్ పేజీలు :** 152, **వెల :** రూ.75
**కావ్యకళ, పేజీలు :** 308, **వెల :** రూ.150
**రచన :** కె. సదాశివరావు, **ప్రతులకు :** 0866-2436643

---

# ఫన్నీ పెన్ను

ప్రస్తుతం తెలుగులో హాస్య, వ్యంగ్య రచనలు చేస్తున్న అతి కొద్దిమందిలో యాసీన్ ఒకరు. యాసిన్ పెన్ను పడితే ఫన్నులు జాలువారుతాయి. 'హాహాకారాలు' పేరుతో ఆయన తీసుకొచ్చిన ఈ పుస్తకం నిండా సెటైర్లే. వాటిని బుజ్జిగాడి కథలు, రాంబాబు కథలు, నా కథలు, బావ కథలు, జంతు కథలు, కొసరు కథలు .. ఇలా విడగొట్టి మరీ వ్యంగ్యాన్ని పండించారు.

మొదట్లో తన కొడుకు సెంట్రిక్‌గా రాసిన కథలు మహా నవ్విస్తాయి. 'కాకి కిడ్డు కాకికి కిస్సు' (కాకిపిల్ల కాకికి ముద్దు) అని కదా సామెత. పిల్లల అల్లరి ముద్దుగానే ఉంటుంది. ఒకమేర శృతి మించినా ఓర్చుకుంటాం. ఎందుకంటే కన్నూ మనదే వేలూ మనదే. ఇంటికి తెచ్చుకున్న ఎల్‌సిడి టి.వి.ని పిల్లోడు కత్తితో చీరేస్తే ... మా కొత్త ఎల్‌సిడి టి.వి. బలాన్ని వాడు కత్తి మొనతో పరీక్షించాడు, ఈ పరీక్షలో కత్తికి ఏమీ కాలేదన్న బాధ వాడి కళ్లలో కనిపించిందంటాడు. వాడు డిజిటల్ గడియారాన్ని ముళ్ల గడియారానికి వేసి గుద్దినపుడు రెండూ పగిలినా అందులో ఒకటి వెనక్కి తిరగడం మొదలుపెట్టిందట. కాలాన్ని వెనక్కి తిప్పడం దేవుడికే సాధ్యం కాకపోయినా కొడుక్కి సాధ్యమైందంటూ మురిసిపోతాడు.

పేర్లలో ఏముందన్న షేక్స్పియర్‌కే సవాలు విసురుతాడు ఈ బుడతడు. నేములోనే అన్నీ ఉన్నాయంటాడు వీడు. అందుకే అంకాలజీ అయినా చింపాలజీ అయినా జనానికి అర్థం కావాలంటాడు. ఇకపై కళ్ల డాక్టర్‌ని ఆప్తల్మాలజిస్టు అని కాకుండా 'విజనిస్టు' అని, పీడియాట్రిషన్‌ను 'కిడ్స్ స్పెషలిస్టు' అని పిలవాలంటాడు. సెన్ను, సైన్సు, సోషల్ సైన్సును పేకమేడల్లా అల్లేసి పాఠకులను గిరగిరా తిప్పేస్తాడు. పిల్లికి గడ్డం ఉండనపుడు పిల్లిగడ్డం అంటారెందుకో అంటూ గడుసుగా అడిగేస్తాడు.

రాంబాబు కథల్లో మరీ కొత్త కొత్త విషయాలని డిస్కవరీ చేస్తాడు రచయిత. కోడి తలపై ఉండే పగడపు తురాయిని చూపి తొలి కమ్యూనిస్టు కోడి అంటూ జీవశాస్త్రాన్ని సామాన్యశాస్త్రంతో కలిపి కొత్త సిద్ధాంతాన్ని ఆవిష్కరిస్తారు యాసీన్. లోకంలో కష్టపడేది ఒకరైతే క్రెడిట్ కొట్టేది మరొకరైనట్లు పలానా హోటల్‌లో ఇడ్లీ బాగుందంటారు కానీ ఒక్కడూ చెట్నీ గురించి మాట్లాడడు. చెట్నీ లేకుంటే ఒక్క ముక్క దిగదు - అయినా క్రెడిటంతా ఇడ్లీకే. క్రికెట్‌లో చచ్చి చెడి ఒకడు క్యాచ్ పడితే ఘనతంతా బౌలర్‌కి ఇచ్చి కిరీటం పెడతారంటూ చెట్నీస్ అండ్ చెనక్కాయ్ థియరీలో పల్లీలు దంచి మరీ చెబుతారు. ఇలా యాసీన్ నవ్వులపువ్వుల ఒక పెద్ద హాస్య, వ్యంగ్య గుచ్ఛాన్ని పాఠకులకు అందించారు.




**- గోవర్ధనం కిరణ్‌కుమార్**

**హాహాకారాలు**, యాసీన్
**పేజీలు :** 206, **వెల :** 160,
**ప్రతులకు :** 99121 99423, ప్రముఖ పుస్తక కేంద్రాలు




# లీస్టెన్‌స్టీన్ గంటలో చుట్టే వచ్చాం



ట్రావెలోకం

**యూరప్ యాత్రలో భాగంగా ఆ మధ్య యూరప్‌లోని అతి చిన్న దేశం 'లీస్టెన్‌స్టీన్'ను దర్శించాం. ఆస్ట్రియా, స్విట్జర్లాండ్ దేశాల మధ్యలో ఉన్న ఆ దేశ వైశాల్యం 25 చ.కి.మీ. కాగా జనాభా 40 వేలు మాత్రమే.**

బ్రెజెల్స్ నుండి రోడ్డు మార్గాన బయలుదేరి వెళ్లాం. ఒకవైపు దట్టమైన చెట్లతో నిండి ఉన్న కొండలు, మరోవైపు పచ్చని తివాచీ కప్పుకున్న విశాలమైన పచ్చికబయళ్లు, మధ్య మధ్యలో రైన్ వ్యాలీ అందాల లోయలు. అప్పుడప్పుడు పడుతున్న వాన చినుకులు. దూరాన కొండలపై వయ్యారంగా సాగుతున్న నీటి మబ్బులు. ఆ అద్భుతమైన దృశ్యాలను, చక్కని వాతావరణాన్ని ఆస్వాదిస్తూ పాములా వంపులు తిరిగిన నల్లని నునుపైన రోడ్లపై ప్రయాణిస్తూ లీస్టెన్‌స్టీన్ రాజధాని 'వాదుజ్ చేరుకున్నాం. దాదాపు ఆరు గంటలు ప్రయాణం చేసినా అలసిపోయినట్లు అనిపించలేదు.

బస్సు దిగి రోడ్డు మీదే ఒక చోట రైలు కోసం నిరీక్షిస్తూ నిలబడ్డాం. చిన్న చిన్న 4 బాక్సులున్న ట్రెయిన్ వచ్చింది (ట్రాము లాంటిది) దాదాపు 20 మందిమి ఎక్కగానే రోడ్డు పైనే బయలుదేరింది. దేశ వివరాలను, వాదుజ్ పట్టణ విశేషాలను గైడ్ వివరిస్తూ ఉండగా ట్రెయిన్ చిన్న చిన్న ఏటవాలు రోడ్ల మీదుగా వెళ్లాం. అందమైన భవంతులు, చుట్టూ పూలమొక్కలు, వివిధ ఆకారాల్లో కత్తిరించిన క్రోటన్‌లు, ఇళ్ల పక్కనే నిలిపి ఉన్న రకరకాల బ్రాండెడ్ కార్లు .. కనువిందు చేశాయి.

వాదుజ్ పట్టణ జనాభా 5 వేలు మాత్రమే. అత్యంత అధిక తలసరి ఆదాయం కలిగిన జనాభా ఈ దేశంలోనే ఎక్కువట. మెయిన్ రోడ్ల నుండి ప్రయాణిస్తూ చివరకు కంట్రీ సైడ్‌కు మా ప్రయాణం సాగింది. ఒక దగ్గర వర్షంలో కూడా ఫుట్‌బాల్ ప్రాక్టీస్ చేస్తున్న క్రీడాకారులు కనిపించారు. ఫుట్‌బాల్ క్రీడా మైదానాలు కూడా చాలా కనిపించాయి. యూరపియన్లకు ఫుట్‌బాల్ క్రీడపైగల మక్కువను అక్కడ ప్రత్యక్షంగా చూడగలిగాం.

దూరంగా ఎత్తైన కొండపై పచ్చని చెట్ల మధ్య మబ్బులను కప్పుకున్న రాజప్రాసాదం (Castle) కనిపించింది. చిన్నప్పుడు మనం చదివిన చందమామ కథల్లోని రాజ ప్రాసాదాలు గుర్తుకొచ్చాయి. లీస్టెన్‌స్టీన్‌ను ఇప్పటికీ రాజకుటుంబమే పరిపాలిస్తుందని, వారు అందులోనే నివసిస్తున్నారని గైడ్ వివరించాడు. రాజు హన్స్ - ఆడమ్ అయినా అధికారం ఆయన కొడుకైన యువరాజు అలియోస్ చేతిలో ఉందని చెప్పాడు. లీస్టెన్‌స్టీన్ జాతీయ సెలవు దినం రోజున రాజప్రాసాదం ఆవరణలోని విశాలమైన అందమైన తోటలో రాజు 'వాదుజ్ వాసులందరికీ బీరు పార్టీ ఇస్తాడని చెప్పాడు. వాళ్ల భాష జర్మనే అయినప్పటికీ ఇంగ్లీషులో గైడు వివరిస్తున్న తీరు మాకందరికీ నచ్చింది. ఆ తర్వాత మా ప్రయాణం సన్నని దారుల మధ్య గ్రామీణ వాతావరణంలో సాగింది. ఒకవైపు ద్రాక్షతోటలు, మరోవైపు చిన్న పంట కాలువలు, ఇంకొంచెం ఆవల ఇతర పైరులు ... చూడటానికి రెండు కళ్లు చాలవన్నట్లుంది. దాదాపు గంట పోయాక మళ్లీ వాదుజ్ సెంట్రల్‌లో దించారు. సన్నని సిల్కు దారాలతో చేసే వివిధ అలంకరణ ఆకృతులు చేయటంలో అక్కడివారు నేర్పరులు. ఫైన్‌వుడ్‌తో చేసిన వస్తువులు మమ్మల్ని బాగా ఆకట్టుకున్నాయి.

ప్రజలు చాలా నిదానమైన వారని, నేరాలు చాలా తక్కువగా జరుగుతాయని, ఎంత తక్కువంటే చాలామంది ఇంటికి గడియ కూడా పెట్టుకోరని తెలిసి ఆశ్చర్యపోయాం. ఇంతలో మా టూరిస్టు బస్ రావటంతో అందరం తిరుగుప్రయాణమయ్యాం. అలా మా లీస్టెన్‌స్టీన్ యాత్రానుభవం ఒక రమణీయ దృశ్య కావ్యంగా మా మదిలో నిలిచిపోయింది.

**- సూర్యదేవర అనీజ, 94401 06194**


కొండపై రాజప్రాసాదం


ట్రామ్ దగ్గర వ్యాసకర్త

